# Kalingadesa

 **Kadhalu**

BY

**RATNAKARAM ANANTHACHARYULU**

*Ubhaya Bhasha Praveena, Satavadhani & Pandit,*

A. C. College High School.

GUNTUR



Copy Right holder & Publisher

**B. BIKARI SINGH,**

PROPRIETOR

**ANDHRA BOOK DEPOT,**

**GUNTUR.**

శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# కళింగదేశ కథలు

ఇయ్యది

ఉభయభాషాప్రవీణ, శతావధాని, గుంటూరు క్రిస్టియను కాలేజి
హైస్కూలునందు సంస్కృతాంధ్రోపాధ్యాయుఁడు నగు

రత్నాకరం అనంతాచార్యులుగారిచే

వ్రాయఁబడినది.

---

ప్రథమ ముద్రణము.

1000 ప్రతులు.

గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

గుంటూరు, ఆంధ్ర బుక్కుడిపో ప్రొప్రయిటరు
బి. బికారిసింగుగారిచేఁ
బ్రచురింపఁబడినది.

1934

కాపీరైట్ రిజిష్టర్డ్] [వెల రు 0-12-0

# విజ్ఞప్తి

—:o:—

ఆర్యులారా ! పాఠకులార !

ఈ గ్రంథము కళింగదేశచరిత్ర మను నుద్గ్రంథమునుండి కొన్నికథలు సంగ్రహించి వ్రాయఁబడినది. ఇందుఁ గొన్నికథలును, కొన్ని సవరకోయజాతిసంబంధము లగునాచారవ్యవహారములును, అప్పటికాలంబునఁ గళింగదేశంబునం గలవిశేషంబులును, అప్పటివైభవంబులును, అచ్చటచ్చట ముచ్చటింపఁబడినవి. ఇయ్యది విద్యార్థులకుఁ బఠనయోగ్యమగునట్లు భాషాసంప్రదాయముల ననుసరించి సులభశైలిని వ్రాయఁబడినది. ఇందుఁ దాత్కాలికభూపాలచరిత్రంబులు భక్తివిశేషంబులు వెల్లడింపఁబడినవి. కావున గుణగ్రహణపారీణు లిందు దోషంబుల వీడి గుణములను గ్రహించి నన్ను మఱింతప్రోత్సహింతురని నమ్ముచున్నాను.

ఇయ్యది గుంటూరు ఆంధ్రబుక్ డిపో ప్రొప్రయిటర్, బి. బికారిసింగుగారికి నన్నిహక్కులతో నొసంగఁబడినది.

ఇట్లు,

గుంటూరు
10-1-1934

ఉభయభాషాప్రవీణ, శతావధాని,
రత్నాకరం అనంతాచార్యులు,
ఆంధ్రక్రిస్టియను కాలేజి హైస్కూల్
సంస్కృతాంధ్రోపాధ్యాయుఁడు.

# విషయసూచిక

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# కళింగదేశకథలు

## 1. చిత్రగాయకుఁడు

---

తొల్లి యొకానొక కాలంబునఁ దుంబుర నారదాదులు హిమాలయంబు దాపునం గల గంగాతీరంబున నొక యాగంబుఁ జేయం బూనిరి. ఆయజ్ఞముం జూచుటకు దేవతలు, కిన్నరులు, గంధర్వులు మొదలగువారు వచ్చి వారు శివకేశవులు రావలయునని ప్రార్థించిరి. వారు వచ్చినతరువాత మిక్కిలి వైభవముతో యాగంబు జరుగుచుండెను. అప్పుడు సురగాయకులగు గంధర్వులా వనంబునఁ దమయిష్టానుసారంబుగ సంచరించుచున్నతఱి నచ్చటి శబరాంగనలు వారి చక్కదనంబులఁ గాంచి వారల మోహించిరి. గంధర్వులును మోహాతిశయంబున వారలం గూడిరి. ఈవిషయం బంతయుం జూచుచున్న వామదేవుం డను మునిపుంగవుండు వైష్ణవయాగ సమయంబున నిట్టిపాపంబు లొనరించు గంధర్వులకు శబరయోనులందుఁ బుట్టుఁడని శాపం బిచ్చె. అంతట వారు భయముతో నమ్మనీంద్రునిఁ బ్రార్థింప నతండు నాశాపం బమోఘంబని వక్కా

ణించి యటకు వచ్చియున్న శ్రీమన్నారాయణుని చెంతకుం బంపించె. వా రంతట దీనులై వచ్చి విష్ణుం బ్రార్థించిరి. పద్మనాభుండు వారల శాపంబుఁ దీర్పఁజాలినవాఁడయ్యును, రాఁ బోవుసంగతి విచారించి శంకరుని దాపునకుం బంపె.

అంతట శంకరుండు వారలదీనాలాపంబుల విని విప్రశాపం బమోఘంబని నిరూపించి వారల నందఱిని వంశధారానదికిఁ దూర్పువైపునం గలమాధవవనంబున శబరాలయంబుల జన్మింపుఁడని యానతిచ్చి ముందుకుఁ దాను దర్శనమిత్తునని యుఁ బిమ్మట శాపమోక్షణంబుఁ గాంచి మీనివాసంబులకు మీ రేగుదురనియు నుడివి, వారల నోదార్చిపంపెను. నారదాదులు తమయాగమును సమాప్తినొందించి యటకు వచ్చిన వారల గౌరవించినతరువాత నందఱు తమతమనివాసంబులకుం బోయిరి. శంకరుండు నాఁడుమొదలుకొని శబరవనాంతరంబున నొకమధువృక్షంబుక్రిందఁ బార్వతీగణసేవితుండై నివసించుచుండె.

పిదప గంధర్వు లందఱు శివుని యాజ్ఞాప్రకారముగ శబరాలయంబుల జన్మించిరి. వారిలో నొక్కరుండు వారందఱ కధిపతియై చిత్రగాయకుం డనునామంబున వర్తించుచుండె. ఈతఁడు చాల మంచివాఁడు. వీనిగుణములలో నొక్కగుణంబు మాత్ర మత్యద్భుతంబు. ఏమనఁ దనతోడివారలు వేఁటకుం బోయి తెచ్చిన జంతుసంతానంబులఁ దమతేనికి బహుమానంబుగ నొసంగఁ జిత్రగానం బొనరించు నతనిగానంబున మరల నాజంతువులు జీవించి పరుగెత్తుచుండెడివి. అందువలన నీ నా

మం బితనికి సార్థకంబై చెలంగె. ఇవ్విధంబున నాచిత్రగాయ
కుండు సుఖంబున రాజ్యం బొనరించుచుండెను.

ఇట్లు కొంత కాలంబున కొకనాఁటిమధ్యాహ్నసమయంబున నెండచే వాడినముఖముగలదియై, చెమ్మటలచేఁ దడిసిన పైటగలదియై, తనకుచంబులగుట్టు బట్టబయలై కాన్పింప నొక యువతి యట కేతెంచెను. అంతట నాచిత్రగాయకుం డాలలనామణి వీక్షించి వలపు నిలుపలేక యామెతో నిట్లనియె.

ఓ కాంతా ! కొంచెమైనను భయములేక దుష్టమృగంబులు గలయీవనంబున కొంటరిగా నీ వేల వచ్చితివి. నీ వృత్తాంతం బేమి ? యని యడుగ నందుల కామె వానితో నిట్లనియె. ఓ శబరనాయకా ! మార్గాయాసంబున మిగుల నలసట చెందియుంటిని. క్షుత్పిపాస లధికముగా నన్నుఁ బీడించుచున్నవి. భక్తవత్సలుం డగుభగవంతుఁడు నిన్ను నాకుఁ జూపించె. కావున నీవు నా కేమైన నొసంగిన దేవతాపూజ యైనపిదప నావృత్తాంతంబు దాపక యెఱింగింతుననియె. అందుల కాతఁడు సంతసించి యింటి కేగి యీ వృత్తాంతంబు తన భార్యకుం జెప్పెను. ఆమెయు బియ్యము మొదలగుపదార్థంబుల నొసంగె. అంతట నావెలఁది వానిని వంశధారానదీతీరంబునకుఁ గొంపోయి యొకచెట్టుక్రిందఁ బెట్టి యానదిలో స్నానంబుఁ జేసి పాకంబు గావించి యీశ్వరున కర్పించి పిమ్మటఁ దా భుజియించి కొంతతడవు మార్గాయాసంబుఁ దీర్చికొనుటకై విశ్రమించి లేచి తనకై నిరీక్షించుచుండు శబరాధిపతి సమీపంబున కేగి తనచరిత్రం బిట్లు వక్కాణింపఁ దొడంగె.

ఓశబరనాయకా! మాది శ్రీశైలమహాక్షేత్రము. ఆ క్షేత్రమునందుఁగల స్త్రీపురుషాదు లెల్లరు కామాదుల జయించి భక్తిచిత్తులై యుందురు. నే నమ్మహాక్షేత్రమున నివసించుచు శంకరుని పూజావిధానంబుల యథావిధి నెరనేర్చు పూజారి పుత్త్రికను. యౌవనము మొదలుగాఁ గామాదుల జయించి శివమంత్రరహస్యం బెఱింగి తన్మంత్రానుష్ఠానంబులం జేయుచుఁ జిత్కళ యనునామంబున వెలయుచుందును. ఇవ్విధంబునఁ బరచింతలు లేక సంచరించు నానడవడిం గాంచి యోర్వలేనివారై యెల్లవేళల నన్ను నిందించు బాంధవులనిందలు సహింపఁజాలక కాశీమహాక్షేత్రంబున కేఁగఁదలఁచి పాంథులతో సింహాచలమువఱకు నడిచివచ్చి వారలు ముందుగ నరుగ మార్గంబు దెలియక తిరిగితిరిగి విసికి దైవానుగ్రహంబున నేఁటికి మీపల్లెఁ జేరితిని. కావున నాకు మార్గంబుం దెలిపి పుణ్యంబుఁ గట్టికొమ్మనెను. అంతట నాశబరనాయకుండు నవ్వి యోరమణీమణి! నీ వెక్కడ? కాశి యెక్కడ? నీ మాటలు మనంబున కద్భుతంబు గొల్పుచున్నవి. నే నొక్కటి చెప్పెద వినుము. నే నీశబరులకు నాయకుండను నీ రూపలావణ్యాదులు చూచినప్పటినుండి మదనుం డేయువిరితూపుల కోర్వలేకుంటిని. నాభార్య చిత్తి యనునదియు నిన్నుఁ జూచి సమ్మతించును. నీవు కోరినవస్తువుల సమకూర్చి యిచ్చెదను. నన్ను వివాహమాడి యిచ్చటనే సుఖంబుగాఁ గాలంబుఁ గడుపుమని బుజ్జగించుచు బోధించెను.

అంతటఁ జిత్కళ తనపూర్వకర్మవశంబున నాశబర నాయకుం డగుచిత్రగాయకునియందు వలపుగలిగి ధైర్యంబుతో నిట్లు ప్రత్యుత్తరం బిచ్చెను. నీకు నీజాతిభార్య గలదు. నీయింటనుండి నేను భోజనమజ్జనాదు లొనర్చుచు శివపూజాదుల నొనర్పంజాలను. కావున నా కొకమందిరంబు వేఱుగ నియమించియిచ్చినఁ గాశీప్రయాణంబు విడి యిచ్చటనే యాశివపూజ లొనరించుకొనుచు నుండుదననియె. అందుల కాతఁడు సమ్మతించి చిత్కళ కోరినవిధంబుగ నొనర్చెను. అంతటఁ జిత్కళయు నాశబరనాయకునియందు ననురాగవతియై తనమానసంబున నాభక్తవశంకరుఁ డగుశంకరుని నిల్పి యాశబరపల్లియందు సుఖంబుగఁ గాపురముండెను.

చిత్రగాయకుం డిట్లు చిత్కళయందుఁ బ్రేమగలవాఁడగుట నెఱిఁగి చిత్రియను నితనిభార్య యితని దాపునం జేరి "ఓప్రాణనాథా! జాతిభార్యను నే నుండ సవతి నొకర్తుకం దెచ్చి దానిం గూడియుండుట మీకు ధర్మమా? యని పలుక నాతఁడు చిత్రి కిట్లనియె. ఓకాంతారత్నమా! నీకు నాయందుఁ గోప మేటికి? దారి దప్పివచ్చినవెలందిని రక్షించుట ధర్మముగాదా? ఇదియునుం గాక లోకంబున నొక్కరి కిరువురుభార్యలు లేరా? శంకరునివంటివాఁడు గంగను దెచ్చి శిరంబున ధరింపలేదా? కావున నేను నీ కేమియు లోపంబుసేయను. నీ యింట నొక్కనాఁడును దానియింట నొక్కనాఁడును విహరింతునని భార్య నోదార్చి పంపెను.

ఇట్లు చిత్రగాయకుండు కొంతకాలంబు గడచినపిమ్మటం దనయింటికి సమీపంబునం బువ్వులగుత్తులచే నొప్పారుచు నొక్కమధువృక్షము ప్రకాశించుచుండ నావృక్షంబును దన యిర్వురు భార్యలకుం జూపి కాంతలారా! యీ చెట్టుక్రిందం బ్రతిదినంబున రాలుపువ్వుల మీ రిర్వురు నేరి యమ్ముకొని దానివలన దొరకిన ధనంబుచే జీవించుచుండుఁడని యాతరు శాఖల నిర్వురికి విభాగించి యిచ్చెను. అందు దక్షిణపు వైపున నుండుకొమ్మ చిత్కళకును, నుత్తరపువైపున నుండుకొమ్మ చిత్రికిని భాగములప్రకారము వచ్చినవి. అంతటం జిత్కళ తన భాగమునకు వచ్చినకొమ్మక్రిందం బ్రతిదినంబును జక్కగ నూడ్చి గోమయంబునఁ నలికి ముగ్గులిడి ప్రాతః కాలంబున లేచి చంద్రశేఖరుని భావంబుననుం చిత్తరుమూలంబున నున్న పుట్టలోఁ బూజ లొనరించుచుండ నామెవైపున నున్న శాఖనుండి రాలు కుసుమంబులు సువర్ణమయములై యుండుటంగాంచి యిదియంతయు నాశంకరునిప్రభావ మని యూహించుచు వాని నేరికొని దాపుననున్న యొకపట్టణంబున కేగి యట నొక వైశ్యునకు కా కుసుమంబుల విక్రయించి దాన వచ్చినధనంబునం గావలసిన వస్తుసముదాయంబులం దెచ్చికొని యథావిధి శివునిం బూజించుచు భక్తిచేతస్కయై కాలంబుఁ గడుపుచుండె.

చిత్రగాయకుని కులసతియగు చిత్రియనునది తనభాగమునకు వచ్చిన కొమ్మనుండి రాలు కుసుమంబుల నేరికొని చిత్కళ యమ్ము వైశ్యునకే తనపువ్వులంగూడ నమ్ముచు నొక్క నాఁడు వానితో నిట్లనియె. ఓ వైశ్యోత్తమా! నే నమ్మునవి

పువ్వులుగా వా? మాయిద్దరియెడల నీ కీపక్షపాత మేల? నీ కిది ధర్మమా? చిత్కళకు ధన మెక్కుడుగ నొసంగి నాకు స్వల్పంబుగ నొసంగుచుంటివన నాచిత్రికి నావైశ్యం డిట్లనియె. అమ్మా! నాకు మీరిర్వు రొక్కటియే కాని భేదంబు లేదు. నీపువ్వులకు నా మెపువ్వులకుఁ గలతారతమ్యంబుఁ జూపెదఁ జూడుమని యిద్దరిచేఁ దేఁబడిన విరులం జూపి యందుఁగల భేదంబుఁ జిత్రికిం దెలిపెను. అంతటఁ జిత్రి చిత్కళ దెచ్చిన విరులు సువర్ణవికారంబు లగుటకుం గినిసి మిక్కిలి కోపము గలదియై పక్షపాతము లేని తనమగనిచెంతకుం జని యివ్విధం బున దుఃఖించెను.

ఓకిరాతనాయకా! చిత్కళతో నీ వెంతయనురాగ వంతుఁడవై సంసార మొనర్చుచున్నను, న్యాయమార్గంబుఁ బాసి బంగారుపువ్వులు కురియుకొమ్మ నామె కిచ్చి నిరర్థకంబు లైనకుసుమంబులు రాలుకొమ్మ నా కిచ్చుట నీకు ధర్మమా ? యని ప్రశ్నింప నాచిత్రిగాయకుండు దక్షిణపువైపున నుండు కొమ్మ చిత్రికిని, నుత్తరపువైపున నుండుకొమ్మ చిత్కళకు నిచ్చెను. అట్లుచేసినను జిత్కళకు వచ్చినకొమ్మ బంగారు పువ్వులనే కురియుచుండెను. చిత్రిభాగంబునకు వచ్చినకొమ్మ మధుపుష్పంబులనే పూయుచుండెను. ఇట్లుండ నీవిషయం బును జిత్రి పరికించి శోకంబునఁ జిత్కళ యేమేమో క్రియ లొనరించుచున్నదని యోర్వలేక చిత్కళం గొట్ట నామె తన నాథుం డగుచిత్రగాయకునిచెంత కరిగి జరిగినవృత్తాంతం బంతయు వాని కెఱింగించెను.

అంతట శబరనాయకుండు చిత్రిం జూచి యోసి దురాత్మురాలా ? కొంచెమైనను భయములేక చిత్కళ నూరక యేలకొట్టితివి. అన్యాయంబున నితరులఁ గొట్టుట పాతకంబు గదా ? చిత్కళాకిరియలు నీ కేమి తెలియునని కోపించెను. అంతట నామె దేశాటనంబుఁ జేయువార లెంతటివారలైనను జేయఁగల రనిపలుకుచుఁ దనవైపున మధుపుష్పంబులును, జిత్కళాభాగంబున సువర్ణపుష్పంబులును బూయుట నెఱిం గించి యీవృక్షంబంతయు నా కొసంగి యీమాయలాడిని విడిచిపెట్టినయెడల నీయొద్దనే యుండి నిన్ను సేవింతునని నుడి వెను. అంతటఁ జిత్రినాయకుండు కొంతతడవు విచారించి వీరి ద్వురి విరోధంబునకుఁ గారణం బీమధువృక్షంబయని తలఁచి దానిని తనచేతం గలగొడ్డలిచే నఱకెను.

ఇట్లు తెలియక కోపావేశంబునఁ జిత్రినాయకుం డా వృక్షంబును ఖండింప దానిమూలంబునం గలకోటరంబుననుండి ప్రళయానలంబుతో సమానంబగు నసలంబు వెలువడి ముల్లో కంబుల వ్యాపించె. అప్పు డాతఁ డక్కాంతి శంకరుని దివ్య తేజంబుగావునఁ జూడంజాలక యీవృక్షమూలంబున మూర్ఛి తుం డయ్యె. అంతటఁ జిత్రి దుర్మార్గురాలై చిత్కళ తనభర్తం జంపెనని కేకలిడికొనుచు జాతిబంధువులతోఁ దెల్ప వారలు విచ్చేసి యీవచనంబు యథార్థమని నమ్మి కోపంబునఁ జిత్క ళంబట్టి వధింతుమని యాయుధంబులం జేఁబూనిరాఁగా వా రలంజూచి చిత్కళ భక్తవత్సలుం డగునాశంకరుని బ్రార్థిం చెను. అంతట నాతండు ప్రమథగణసమేతుండై పార్వతీదేవి

తోఁగూడ వృషభవాహన మారోహించి ప్రత్యక్షమయ్యె. శబరులందఱు వాని దివ్యతేజంబుగాంచి శాపవిముక్తు లైరి. పిమ్మటఁ జిత్రగాయకుండును మూర్ఛందేరి గంధర్వుఁడై నిలిచి యాభక్తవశంకరుం డగు శంకరు ననేకవిధంబుల సన్నుతించి నిజపదంబునకుం జనియె. శంకరునాజ్ఞచే శబరు లందఱికిని గంధర్వత్వము సంభవించినది. అప్పుడు దేవతలందఱు పుష్పవృష్టిం గురిపించిరి వారందఱుఁ జూచుచుండఁ బరమభక్తురా లగు చిత్కళ యీశ్వరుని దేహకాంతిలో నంతర్ధానురాలయ్యెను.

కావున లోకములో భక్తికి మించిన దేదియు లేదు. ఉత్తమలోకప్రాప్తికి భక్తియే నిశ్రేణియగును. ఇందులకు దేవతలందఱు శంకరుని వినుతించుచు జనులకు ముక్తినొసంగ నామధువృక్షకోటరాంతరంబున మధుకేశ్వరుం డను నామంబుతో నివసింపుఁడని ప్రార్థించిరి. అటఁగల శ్రీముఖలింగక్షేత్రము కాశీక్షేత్రంబునకు సమానంబైన దాయె. విష్ణుదేవుం డిచటఁ బర్వతంబునఁ బద్మనాభమూర్తియై క్షేత్రపాలకుం డాయె. పిమ్మట బ్రహ్మాజ్ఞానుసారంబుగా విశ్వకర్మ యాక్షేత్రంబున సుపర్ణమయదేవాలయాదుల నిర్మించి చనియె. ఇప్పటికి నాక్షేత్రంబున నీ చిత్రగాయకాదులవిగ్రహంబులు శిలలపై నమర్పఁబడినవి. వానివిం జూపుచుఁ బూజారులు క్షేత్రదర్శనార్థమై వచ్చుభక్తకోటివలన ధనంబు సంగ్రహించుచుందురు. ఇట్టిచరిత్రంబులు పఠించువారలును, వినువారలును, శంకరుని కృపచే నాయురారోగ్యైశ్వర్యాదులఁ గాంచి తుదకుఁ గైవల్య మొందుదురుగాక.

---

## 2. కాళింగులు

పూర్వము కళింగరాజ్యము, చాలమట్టుకు గహనంబు లతో నిండియుండెను. ఇది యిప్పటి కెట్టిమార్పులచే నొప్పారుచుండినను, బ్రిస్తుతము కాళింగు లని పిలువఁబడువారు గంజాంజిల్లాలోని యిచ్ఛాపురమునకును, విశాఖపట్టణము లోని చీపురుపల్లికిని మధ్యభాగమునమాత్రము మిక్కుటముగఁ గాన్పించుచున్నారు. కాని యీకాళింగు లీప్రదేశము లందే కాక మఱికొన్ని ప్రదేశములందును వసతుల నేర్పఱచుకొని యున్నట్లు జనాభాలెక్కలవలనఁ దెలియవచ్చుచున్నది. ఈకాళింగు లందఱును కర్షకులై జీవించువారే. వీరిని జుట్టు పట్టనుండువారు శూద్రులుగ నె పరిగణింతురు. కాని వీరిలోఁ గొందఱు భూసురులమని చెప్పుకొనుచుఁ దదాచారవ్యవహారంబుల నవలంబించియుందురు. వీరిలో వేదవేదాంగముల నభ్యసించి విప్రులవలె నాచారవ్యవహారంబుల నాచరించువారు కొందఱు గలరు. కొర్ని, కొర్లాములలోనికాళింగులు గీర్వాణభాషాపాండిత్యనిపుణులై వేదములయందును, నాహారములయందును, నాంధ్రవైష్ణవులం బోలి కాన్పింతురు. ముఖలింగక్షేత్రంబునం దుండుకాళింగులు మధుకేశ్వరాలయంబున శంకరునియర్చకులుగా నుండి తమయాధిక్యమును వెల్లడించుకొందురు. కొందఱు పౌరోహిత్యము నవలంబించి యన్యజాతులవారియిండ్లలో వివాహాదులఁ జేయించుటలో యథావిధిగ జరిగించకపోయినను, జరుగవలసినతంతుమాత్రము

జరుపుదురు. కొందఱు హీనజాతులకు గురువులుగానుండి యప్పుడప్పుడు వారలకుఁ, దీర్థప్రసాదంబుల నొసంగి వారివలన ధనంబుఁ గైకొనుచుందురు. ఇవ్విధంబున వీ రెట్లుసంచరించుచున్నను వీరలఁ దక్కినవారుమాత్రము శూద్రులుగనే తలఁతురు.

వీరిలో మొట్టమొదట నాలుగుజాతులవా రుండిరని యు నందు వైశ్యులుదక్క మిగిలిన మూడుజాతులవారును నేవియో కొన్ని కారణములవలన శూద్రులుగఁ బరిగణింపఁ బడుచుండిరనియు నూహించుట కవకాశము గాన్పించుచున్నది. ఇందు వైశ్యులు జరుగునట్టి పరివర్తనములందుఁ బాల్గొనక వేఱుగ నుండుటచే నీకాళింగులలో నాలుగుజాతులవా రుండిరని నొక్కి వక్కాణింపఁదగియున్నది.

పూర్వము కళింగదేశము బౌద్ధమతాక్రాంతమై బౌద్ధులకును, బ్రాహ్మణులకును, నాగర్భశత్రుత్వ ముండుటయే యీమార్పునకుఁ గారణమైయుండవచ్చును. వీరు బ్రాహ్మణులు ముట్టరానిమత్స్యమాంసాద్యాహారంబుల స్వీకరించి విద్యావిహీనులై వేదోక్తాచారంబుల విడనాడి శూద్రాచారంబుల నాచరింతురు. ఇప్పటికిని గాళింగులలోఁజాలమంది వ్యవసాయమే యవలంబించి జీవించుచుందురు. ఇట్లు తక్కువజాతివా రెక్కువజాతివా రగుటయు, నెక్కువజాతివారు తక్కువజాతివా రగుటయుఁ బూర్వమే కాక యాధునికయుగంబునను, బరివర్తనము లిట్లెన్నియో ప్రబలుచుండుట మన మెఱింగియేయుంటిమి. దేశకాలంబులంబట్టి యెట్టి పరివర్తనము లేర్పడి

నను గాళింగులందఱును శూద్రాచారపరాయణులే యైనను మొదట నార్యులలోవలె వీరిలోఁగూడఁ జతుర్వర్ణములవారుండిరనియే చెప్పఁదగియున్నది. కళింగరాజులకు సేనానులెల్లరును మొదట నాయకు లనుబిరుదంబులు గలిగినక్షత్రియులై యుండి నేఁటి కానాయకశబ్దము 'నాయుఁడు' అను నామంబుగా మార్పునొందుటచే నిప్పటికాళింగులెల్లరును "నాయుఁడు" అను నామంబులఁ బిల్వఁబడుచుండిరి.

సామాన్యముగాఁ గాళింగులందఱికిని వ్యవసాయమే వృత్తియైయున్నది. వీరు మాగాణిపంటలను మెట్టపంటలను గూడఁ బండింతురు. ప్రస్తుతము మనవిశాఖపట్టణమునందుఁ గూరలు మొదలగునవి పండించువారు ముఖ్యముగా నీకాళింగులే. వీరు తాము పండించినపంటను మొత్తముగ నమ్ముదురుగాని చిలరగా నమ్మరు. ఒకకుటుంబ ముండినయెడలఁ గుటుంబమునకు మగవాఁడే సంపాదింప నవసరములేదు. కుటుంబములోనివా రందఱును గలిసి సంపాదింతురు. వీరలలోఁ బురుషులు ధనము గడించి తమయొద్ద నుంచుకొనక దానిని స్త్రీలస్వాధీనముఁ జేయుదురు. వీ రేవిషయమునందైనను నెంతయో విచారించినఁగాని యొకకాని వ్యయపఱచరు. వీరలలో మిక్కిలి ధనవంతులు గలరు. ఐనను మొత్తము మీఁద నందఱును జరుగుబాటుకు లోపములేనివారై వర్తింతురు. కావుననే తమదేశమును విడిచి యన్యదేశములకుఁ గూలి కోస మెవ్వరును వీరిలోఁ బోవువారు లేరు. ఈకాళింగు లోఢ్రమును దెలుఁగును మాటలాడుదురు. వీరు

మన కీ రైలుమార్గములు రాకపూర్వము యాత్రికుల నందఱి నిఁ బట్టుకొని కాశీరామేశ్వరాదిపుణ్యక్షేత్రములకుఁ గొం పోవు చుండెడివారు.

వీరిలో బూరగాముకాళింగులనియుఁ, గింతలికాళింగు లనియు రెండుజాతులు గలవు. ఈ రెండుజాతులవారికిని నా చారవ్యవహారంబులలోఁ గొన్నిమార్పులుగలవు. బూరగాము కాళింగులలో మాఱుమనువులు లేవు. కింతలికాళింగులలో మాఱుమనువులు కాన్పించుచున్నవి. బూరగాములం దతి బాల్యవివాహములు మిక్కుటముగ నుండుటచే వీరిలో విధవలు విశేషముగ నుందురు. ఈ రెండు జాతులవారేగాక "బెహ రాణి" కాళింగులను మఱియొకజాతి గలదు. జాతినుండి వెలి వేయఁ బడినవారెల్లరు నీజాతివారిలోఁ జేరుదురని జనులు చెప్పుకొందురు.

కాళింగులలో విద్యరానివారిసంఖ్య మిక్కుటము. వీరికిఁ బట్టుదలమాత్రము విశేషముగ నుండును. ఏదియైన నొక్క యభిప్రాయము చిత్తంబున నాటినయెడల మరల దానినిఁ ద్రిప్పుటకు సృష్టికర్తయైన వలనుపడనేరదు. ఇతరులకు గురువు లుగాఁ గాని దేవళంబులలోఁ బూజారులుగాఁగాని, యుండిన వారు మాత్రము కొద్దియో గొప్పయో చదువుకొనియుందు రు. వీరలలో నాంగ్లేయభాష విరివిగా వ్యాపించలేదు. వీరిలో స్త్రీ పురుషాదు లెల్లరును సాధారణముగా నడుకునూలు వస్త్ర ములే ధరింతురు. అలంకారవిషయములో స్త్రీలు తక్కిన శూద్రజాతుల ననుసరించియుందురు. వీరల వివాహములలోఁ

బురోహితుఁడు శ్లోకములుగాని, దెలుఁగు పద్దెములుగాని, యేవియో చదివినను వివాహమునకు జరుగవలసిన తంతులోని క్రియమమాత్రి మాావగింజంతయైన నతిక్రిమించుటకు వీలుండదు. అట్లతిక్రిమించిన యెడలఁ బురోహితుఁ డనుభవించు పాట్లాశేషుండైనను జెప్పఁజాలఁడని నొక్కి వాక్కాణింపవచ్చును. కాళింగులు వివాహములందుఁ బురోహితుని జాల బాధింతురను సమాచార మాలించియు ధనమున కాసపడి పోవలయునే కాని లేనిచో వారియిండ్లఁ బౌరోహిత్యమున కెవ్వరును ముందంజవేయఁజాలరు. ఈకాళింగు లిప్పుడు మన గంజాము, విశాఖపట్టణము జిల్లాలలో విశేషముగ నివసించియుండిరి. వీరిలోఁ బూర్వము కొందఱు బలపరాక్రిమ సంపన్నులై రాజ్యంబు నేలి వన్నెకెక్కినట్లు చరిత్రికారులు నుడువుచున్నారు. కాని యీవిషయ మెంతవఱకు నిజమో చెప్పుట కంతగాఁ బ్రిమాణములు కాన్పింపవు.

---

# 3. దేవవ్రితుఁడు.

పూర్వకాలమున సకలసంపదలతో నొప్పారుచు రెండవయింద్రిలోకంబన వన్నెకెక్కి కాశ్మీరదేశంబు విరాజిల్లుచుండెను. ఆదేశంబున నన్నిజాతులవారును దమతమకులాచారంబులు పాయక యెల్లప్పుడు నిజమును బలుకుచు ధర్మమార్గంబున నడచుచుండిరి. అందు సకలవిద్యలయం దారితేరిన

దేవవ్రతుఁ డనునొక బ్రాహ్మణుఁడు గలఁడు. ఆయన కొన్నాళ్లు సంసారసుఖంబు లనుభవించి తరువాతఁ గొంతకాలంబునకుఁ గుటుంబకలహంబున నిహలోకసుఖంబు లస్థిరంబులని వైరాగ్యమొంది తనచిత్తంబున నివ్విధంబునఁ దలంచె.

ఈశరీరము గాలిచే నింపఁబడినతోలుసంచిగాని వేఱొండుగాదు. కావున నిదియెప్పటికైన ననిత్యంబని పెద్దలవలన వింటిని. మానవుం డీలోకంబునఁ దాఁ దిరుగులోపలనే పరలోకసుఖంబునకుం దగినయేర్పాటు లేర్పఱచుకొనవలెను. లేనిచో వానికి నుత్తమజన్మంబు లేదు. ఇందులకై పుణ్యతీర్థంబుల సేవించుటగాని, శ్రీమన్నారాయణుని త్రికరణశుద్ధిగఁ దలంచుటగాని, యుత్తమంబు. కావున నే నట్లు చేయవలయునని తలంచుచు మొదటఁ దీర్థయాత్రలు సేయుసమకట్టి బయలుదేఱి మార్గంబున ననేకంబులగు పుణ్యతీర్థంబులు సేవించుచుఁ దుదకు శ్రీశైలముం జేరి యచట శంకరుని సేవించి పండ్లకొఱకు నొకయరణ్యముం జేరి యందుఁ గలవిశేషంబులఁ జూచుచు నొక్కచోట మిగుల నెత్తుగఁ బండ్లచేఁ నిండియుండు నొకనేరేడుచెట్టును జూచి యాచెట్టునెక్కి యాపండ్లఁ గడుపు నిండఁ దిని వానివిత్తనములఁ గ్రింద నుమిసెను.

ఆవిత్తనము లాచెట్టుక్రింద నేకాగ్రచిత్తుఁడై ఘోర తపం బాచరించుచున్నదుర్వాసుం డనుమునీంద్రునిపైఁ బడెను. ఆతం డందులకుఁ గోపించి దేవవ్రతునిం గాంచి "ఓరీదుర్మార్గా కన్నుమిన్ను గానక నేరేడుపండ్లఁ గడుపునిండ మెక్కి వాని విత్తనంబుల నామీఁద నుమిసితివా? ఇందులకుం దగినఫలం

బనుభవింతువుచూడు మని కన్నులనుండి నిప్పులు రాల నీవు చండాలుండ వగుమని ఘోరశాపం బిచ్చెను.

అంతట నాబ్రాహ్మణుండు గడగడవణకుచుఁ జెట్టు దిగివచ్చి యామునీంద్రుని పాదంబులపైఁ బడి నాతప్పు క్షమించి నన్ను రక్షింపుమని వానినిఁ బ్రార్థించెను. తరువాత దుర్వాసుండు దేవవ్రతునిఁ జూచి దేవవ్రతా! నాశాప మమోఘము. దానిం ద్రిప్ప నింద్రాదులైన నసమర్థులు. కావున దానిమోక్షణవిధి నెఱింగింతు నాకర్ణింపుమని యిట్లనియె.

ఈయరణ్యంబున నొక్కయెండిన నేరెడుకఱ్ఱఁ జేఁబూని నీవు సకలతీర్థంబులు సేవింపుము. ఎచ్చట నయ్యది చిగిర్చిన నచ్చట నీకు శాపవిమోచనం బగునని చెప్పె. అందుల నాబ్రాహ్మణుండు వానియాజ్ఞచే నాకఱ్ఱఁదీసికొని నిఖిలపుణ్యతీర్థంబులం దిరిగి యెచ్చటఁ దిరిగినప్పటికి నది చిగిర్పనందులకుఁ జిత్తంబునఁ బరితాప మొందుచుఁ దుదకుఁ గళింగదేశంబునం గల శ్రీముఖలింగక్షేత్రముం జేరి తత్సమీపంబున దక్షిణభాగంబునం గల యొకపద్మసరోవరంబుం గనుంగొని యందు మునిఁగె. అంత నాక్షణంబ యానేరెడుకఱ్ఱ చిగిర్చె. అందుల నాతండు నేను చూచినపుణ్యతీర్థములలో నిది చాల నుత్తమమైనది. దీనిగొప్పతన మెన్న నాశేషునితరమా యని మిక్కిలి సంతోషము గలవాఁడై యాశ్చర్యమొందుచు నిజశాపమోక్షణంబునకు సందియంబాడుచుండ వానితో గగనవాణి యిట్లనియె. ఓవిప్రోత్తమా! నీ వెందులకు సందేహ మొందుచుంటివి. నీశాపమోక్షణం బాయె. ఈక్షేత్రంబున శంకరుండు

జంబునాయకుం డనునామంబునఁ బిలువంబడుచున్నాఁడు. కావున నీవాతని సేవింపుమనెను. అంతట నాదేవవ్రతుం డట్లొనరించి పవిత్రుండయ్యె. కావున నీతీర్థంబు సేవించువారికి సమస్తపాపంబులు నశించుననియు, నెవ్వరేని శ్రావణమాసంబునఁ గృష్ణచతుర్దశియం దీజంబూనాథుని సేవించిన నతండు ప్రత్యక్షంబగు ననుతద్విశేషంబుల నెఱింగి యంతట నటఁగల తీర్థంబుల సేవింపఁ గృతనిశ్చయుండై బయలుదేరి చంద్రుండు పూర్వము తనకు వినాయకుం డిడినశాపంబుచేఁ గలిగిన శ్వేతకుష్ఠరోగంబుం బాపుకొనఁజాలిన కోటితీర్థంబును సేవించి వానిచేఁ బ్రతిష్ఠింపఁబడిన సోమనాథుని బూజించి తత్పూర్వభాగంబున వంశధారానదీతటంబునం గల సోమతీర్థంబునఁ గృతస్నానుండై తద్విశేషంబుల నారసి పిమ్మట శ్రీముఖలింగేశ్వరసోమేశ్వరులమధ్యభాగంబునం బ్రతిష్ఠింపఁబడియున్న భీమేశ్వరుని సందర్శింపఁ గుతూహలుం డయ్యె.

ఈ భీమేశ్వరుండు భీమునిచేఁ బ్రతిష్ఠింపఁబడియె. తొల్లి ద్వాపరయుగంబున దుష్టుల శిక్షించి శిష్టుల రక్షింప శ్రీమన్నారాయణుండు దేవకీవసుదేవుల గర్భంబునఁ గృష్ణావతారుండై యవతరించె. అట్టితఱి యమపవనేంద్రాశ్వినీదేవతలయంశంబున ధర్మజభీమార్జుననకులసహదేవులను నామంబులతోఁ బంచపాండవులు జననమొందిరి. శ్రీకృష్ణుండు లీలామానుషుండై శిశుపాలాదుల సంహరించి భూభారం బంతయు నణంచి భక్తశిఖామణులఁ గాచుచు భక్తవత్సలుం డనుబిరుదంబుఁ దాల్చి సంచరించుచుండె. ఆకాలంబున ధర్మసూనుండు రాజసూయం

బుగావించి నిఖిలరాజ్యవైభవంబులఁ దులదూఁగుచుండె. ధార్త రాష్ట్రులు పాండవుల వైభవంబుం గాంచి సహింపఁజాలక కృత్రిమద్యూతం బొకటి కల్పించి పాండవుల రాజ్యసంపదల హరించి వారలఁ బండ్రెండేం డ్లరణ్యవాసంబునకు నొక్కయేఁ డజ్ఞాతవాసంబునకుం బంపిరి పాండవులు విక్రమసంపన్నుల య్యును ధర్మమార్గతత్పరులగుటంజేసి తా మొనరించిన శపథం బులకుం గట్టువడి మహేంద్రాద్రిశైలప్రాంతంబుల సంచరించు చుండిరి.

ఇట్లుండ నొకనొకదినంబున యుధిష్ఠిరుండును, సోదరులును, పద్మనాభాచలంబును దర్శించి యచ్చోటఁ బద్మనాభుం డెందులకు వసించెనని యాశ్చర్య మొందుచుండ గగనవాణి "ఓ క్షత్రియోత్తములారా! యీశైలంబునకుఁ గొంచెము పశ్చిమభాగంబున జయంతీక్షేత్ర మున్నది ఆక్షేత్రంబు మోక్షదాయకంబు. దానిని రక్షించుటకై జనార్దనుం డిచట నివసించె కావున మీ రాపుణ్యక్షేత్రంబును సేవించి యచట నొకలింగంబుఁ బ్రతిష్ఠించితిరేని మీకోర్కెలు నెరవేరఁగలవన నందులకు వారు సంతసించిరి. పిమ్మట యుధిష్ఠిరునియానతిం గైకొని భీమసేనుం డచట శ్రీముఖలింగేశ్వరసోమేశ్వరులమధ్యభాగంబున నొకలింగంబుం బ్రతిష్ఠించె అందువలన వారు తమరాజ్యసంపదలఁ బొందిరి. ఈలింగంబు భీముండు స్థాపించుటంబట్టి భీమేశ్వరుం డనునామంబునం బరగె. దీనిని సేవించిన నరులు సకలసౌఖ్యంబుల నొందఁగల రనుతత్ప్రభావంబు నాలించి యాస్వామిని సేవించి యటనుండి దేవవ్రతుఁడు సం

బూతీర్థంబునకుఁ బశ్చిమభాగంబునం గలసూర్యతీర్థంబుఁ
కరిగె.

తొల్లి కుంభాండనందనుం డగుసుమదుం డనునొకదై
త్యుండు పార్వతీశ్వరుంగూర్చి సహ్యాపర్వతంబున నేకపాద
బున నిలిచి యనేకవత్సరంబులు తపంబొనరించె. ఆతపంబునక
భూమి గజగజలాడె. ఇంద్రాదిలోకపాలు రందఱును భీతచే
స్కులైరి. అప్పు డావిషయంబును శంకరుం డెఱింగి యాత
సమీపించి దర్శనం బిడి వరంబు వేఁడుమన నాదానవుండ
కోటిసూర్యప్రభాభాసితం బగునొక్కదివ్యవిమానంబుఁ ద
కొసంగుమని శంకరుం బ్రార్థించెను. అవ్విధంబున నాచంద
శేఖరుండు సువర్ణమయంబును, గోటిసూర్యనిభంబు నగు
మానం బాతని కొసంగె. అంతట నా రక్కసుం డావిమానంబ
నెక్కి సూర్యపదంబున కేగుదేగ సూర్యు నారాధించు
ఖిల్యాదిమునీంద్రు లందఱును సూర్యభ్రమనొందుటంబట్టి సు
ర్యుఁడు కోపోద్దీపితమానసుండై తనకిరణప్రభాసంతానంబు
నాతనివిమానంబును భస్మంబు గావించె.

పిదప దానవుండు హాహాకారం బొనరించుచు విమ
నంబునుండి నేలం బడ నవ్వృత్తాంతంబును నారదుండు మహ
దేవున కెఱింగించెను. అంతట శంకరుండు తనభక్తునినాశంబు
కధిక క్రోధంబుం జెంది నిజఫాలనేత్రంబున సూర్యుని భస్మ
బుఁ జేతునని యాతనిపై దృష్టినిగుడింప గగనభాగంబున ని
ధారుండై సూర్యుండు విహంగంబుచందంబున నేలంబడి కొ
వడికిం దెల్విఁగాంచి యీజయంతిక్షేత్రంబున కరుదెంచి 

శ్వరు నారాధించి మరల నిజపదంబున కరిగె. కావున నీతీర్థంబు సూర్యతీర్థం బనంబరగుచుండె. ఇందు స్నానంబొనరించిన నిఖిల రోగంబులు వినాశంబులగు. మఱియుఁ బూర్వము సూర్య వంశపురా జొకండు సత్యవ్రతుం డనువాఁడు వనంబునం దిరుగుచు నీతీర్థంబున స్నానమాచరించి తనకుష్ఠరోగంబుం బాపి కొనియె. కావున నిట్టిమాహాత్మ్యంబు గలసూర్యతీర్థంబున స్నానమాడి యాదిత్యేశ్వరు సేవించి పిమ్మటఁ దత్సమీపంబునం గలకౌబేరమంకణతీర్థంబుల సేవించి పిశాచమోక్షణం బను తీర్థరాజంబున కరిగె. ఈతీర్థమాహాత్మ్యం బాలించువారికిఁ బిశాచబాధ లుండవు.

పూర్వకాలంబున దుండుమారుం డనునొకబ్రాహ్మణోత్తముండు నిజకులాచారానుష్ఠానంబుల నీటఁగలిపి తల్లిదండ్రుల పరిచర్యలు మాని స్త్రీలోలుండై కామాంధకారంబు గన్నుల నావరింప వివేకహీనుండై వారల సంహరించి తుదకు దారిద్ర్యదోషంబున దొంగతనమున కారంభించి యొకానొక దినంబున నొకధనికునింట ధనంబునకై ప్రవేశింప నాధనికుని దౌవారికులు వానినిం బట్టుకొని కొట్టిచంపిరి. పిమ్మట నాబ్రాహ్మణుండు పిశాచజన్మమొంది కళింగదేశంబునం దిరుగుచు జనులను మిగుల బాధింపఁ దొడంగె.

ఇట్లుండఁ గొన్నివత్సరంబులు గతించినపిమ్మట నొకనాఁడు మాఘమాసంబున శివరాత్రియాత్రకై యచ్చటి కేతెంచిన యొకవేశ్యాంగన యీపిశాచమోక్షణతీర్థంబున స్నానంబొనరించి కేశంబులు తనహా సంబులతో విదలించుకొను

చుండఁగా నాకేశంబులం గలయొకజలబిందువు దైవవశంబున దుండుమారుఁ డనుపిశాచుని దేహంబునం బడఁ దోడనే దుండుమారుండు పిశాచరూపంబుఁ బాసి దివ్యశరీరుం డయ్యె. ఆ విషయం బావేశ్యాంగన గాంచి విస్మయమొంది భీతచరితమానసయై యఱచుచుఁ బలుగెత్తుచుండె. అంతట నాతఁ డారో వెలందిని శ్లాఘించి విమానంబునెక్కి దివంబున కరిగె. అప్పటి నుండి యీతీర్థంబు పిశాచమోక్షణం బనుపేర వర్తిల్లె. ఇట్టి మహాత్త్వంబున విరాజిల్లు నాతీర్థంబును సేవించి పిమ్మటఁ దదంతికంబునంగల పుష్కరబిందుహంసాది తీర్థంబుల సేవించి యచ్చటివారలను శ్రీముఖలింగేశ్వరుని ప్రతిష్ఠాదులవిషయమై ప్రశ్నింప వారిలో నొక పురాణజ్ఞుఁ డగు వృద్ధబ్రాహ్మణుం డిట్లనియె.

ఓ బ్రాహ్మణోత్తమా ! పూర్వము కటకం బనునొక దివ్యపట్టణంబు గలదు. ఆపట్టణమును విష్ణువర్ధనమధుకర్ణగజపతి యనునొకగాంగవంశీయుఁడు న్యాయంబున రాజ్యపరిపాలనం బొనరించుచు నొకానొకసమయంబున రాజ్యభారంబెల్లఁ దనపుత్త్రులపై నునిచి చతురంగబలసమేతుండై జయజయనినాదంబులు దిక్కులు ఘోరుకొల్ప రెండవదేవేంద్రుండో యనఁ బరగి బంగరుపల్లకి నెక్కి తీర్థయాత్రను సల్పుటకై బయల్వెడలి మోక్షప్రదాయకంబు లగుకాశీగయాప్రయాగ శ్రీకూర్మసింహాచలాదిపుణ్యక్షేత్రంబుల సేవించుచు నాక్షేత్రములం గలదేవతల యథావిధిఁ బూజించుచు మరలి తనపురంబున కరుదెంచునపుడు మార్గమం దీజయంతీక్షేత్రంబున వంశధారానదీ

తటంబున ననేకంబులగు డేరాలు వేయించి మంత్రులతో నట విడిసెను.

ఆరాత్రి యీభూపాలుండు శయనించియున్నతఱి స్వప్నంబున నిఖిలఫలప్రదాయకుం డగు శ్రీముఖలింగనాయకుండు సాక్షాత్కరించి తొల్లి తా నచ్చట నవతరించినవిధంబును, గోటిలింగంబులు గలయీక్షేత్రంబు కాశీతుల్యంబనియును, నుడివి, నీ వీదేవాలయంబును గట్టించి నిత్యంబుఁ బూజలొనర్చుచుండిన నీకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి గలుగునని యుం జెప్పి యంతర్ధానుం డయ్యె.

అంతట నారాజు తెల్లవారినపిదప లేచి తనకాలకృత్యంబుల నెరవేర్చుకొని నిజపురోహితామాత్యాగ్రుల రావించి యారాత్రి తనకుం గలిగినస్వప్నవృత్తాంతం బాతయును విని పింప వారలు సంతోషించి రాజేంద్రా! అనేకలింగసమన్వితం బగు నిచ్చోట శ్రీముఖలింగనాయకుని స్థానంబుఁ దెలిసికొను టరిదైన దుర్ఘటంబు. కావున నీరాత్రి భక్తియుక్తచేతస్కుఁడవై యాస్వామిని గురుతు తెలుపుమనుచుఁ జేయవలసినదని ప్రార్థించి శయనింపుఁడన నాతం డట్లొనరించె.

పిమ్మట నీశ్వరుండు వానికి స్వప్నంబున దర్శనంబిడి రాజా! నీవు కృతయుగంబున నొకరాజసదృశుండవు; మఱియు నీవు గాంగవంశీయుండ నౌటచేఁ దిరిగి నాదర్శనంబు నీకు లభించినది. కాని యన్యులకు లభింపనేరదు. నీసంచేహమును దీర్చెదను. నీవు రేపటిరోజున నపరాహ్ణసమయమున నీవరి

వారంబుతోఁ బద్మనాభాచలంబునకుఁ బార్శ్వభాగంబునం గల వనప్రదేశంబునకు విహారార్థమై రమ్ము-అని చెప్పి యంతర్ధానుండయ్యె. అంతట రాజు మరునాఁడు లేచి నిత్యకృత్యంబులఁ దీర్చుకొని తనమంత్రిల కావృత్తాంతం బెఱింగించి పరివారసమేతుఁడై వనవిహారమునకు బయలుదేరెను.

ఆసమయంబున నాతం డట నొక బంగారుపావురమును జూచి యాశ్చర్యమొందుచు నిట్టిపక్షి నెప్పుడును జూడలేదని దానిం బట్టుకొనుటకు వలలవాండ్రఁ బిలిపించెను. వారు వచ్చి తమతమ ప్రతాపంబులఁ బలుకుచు వలలు వేయఁదొడంగిరి; కాని యాపావురము చిక్కక యాకసంబున కెగిరి మరలఁ గ్రిందికి వచ్చి సంచరింపఁ దొడంగ వారలు భూమిపై వలలు పఱచిరి. ఆపావురము వారలవలలోఁ బడినట్లుండియు నాసందులలోఁ బడి తప్పించుకొని యట నున్నయొకపుట్టలో దూరెను.

పిమ్మట నీసంగతి వలలవాండ్రు రాజున కెఱింగింప రాజు మంత్రులం జూచి శ్రీముఖలింగనాయకుండు తన యిరవుఁ జూపింప నిట్లొనర్చియుండునని యూహించెద. లేనిచో నిట్టి పావుర మెక్కడ? పుట్టలో దూరు టెక్కడ? ఇది చిత్రంబున కాశ్చర్యంబుఁ గొలుపుచున్న దన వారలు "ఓ రాజా! నీవు సర్వజ్ఞుండ వగుటచే నిట్టివిషయంబు నీకుం దెలిసెం గాని యాశంకరుని మాయ లెఱుంగ నన్యులకుం దరమా?" యని విన్నవించిరి. అంతట నారాజు పుట్టఁ ద్రవ్వింప నందులో ధగధగలాడు ధవళకాంతి సంతానంబులతో వెలుంగు శ్రీముఖలింగ నాయకుం గాంచి నానేత్రంబులు సాఫల్యంబు లయ్యె. నేను

ధన్యుండనైతి నని పలుకుచు నచ్చట నున్నయొకయున్నత ప్రదేశంబుఁ ద్రవ్వింప నొకశ్వేతలింగంబు క్రమంబుగఁ గాన్పించె. అంతట రాజు మిక్కిలి సంతోషించి యట నుండు లింగంబులన్నియు దేవతానిర్మితంబులగు టెఱింగి యొకశ్వేతలింగంబున కొకశ్వేతదేవాలయంబు గట్టింప ధనంబు లేదని చింతాక్రాంతుఁడై పవ్వళింప నారాత్రి శంకరుం డాతని స్వప్నంబునఁ గాన్పించి రేపు సూర్యోదయంబున నాల్గుగురివింద గింజలప్రమాణము గలబిందువులతో సువర్ణమయవృష్టి యేడు గడియలు వర్షించు నని చెప్పి యంతర్ధాన మొందె.

మీఁదట మఱునాఁడు శంకరుఁడు చెప్పినట్లు వర్షింప నాధనముచే నారాజేంద్రుఁడు వంశధారానదీతీరంబున నొక పురంబును దేవాలయంబును నిర్మించుటకై పనివాండ్రఁ బిల్వనంప వారు వచ్చి తత్కాలంబునకుం దగినట్లు దేవాలయమంట పాదులు నిర్మించిరి. అంత నారాజేంద్రుఁడు దేవాలయం బట్లు నిర్మింపఁజేసి యథావిధి స్వామికిఁ బూజలొనరించి తనయానతి జరుగుటకుం దగినయేర్పాటు లొనరించి మరలఁ దనరాజ్యంబునకుం బోయె.

అప్పటినుండి యారాజవంశీయు లందఱు నిప్పటివఱకు వంశపారంపర్యముగ నీదేవాలయంబున కధికారులై యుండి యుత్సవాదులు జరిపించుచున్నారు. కావున నియ్యది కాశీతుల్యంబని చెప్పందగును. దీనిని సేవించినవార లాయురారోగ్యైశ్వర్యాదిసంపదలు గలిగి తుదకు శ్రీముఖలింగనాయకుని కరుణచే ముక్తినొందుదు రని చెప్ప దేవవ్రతుండు సంతోషించి

యా క్షేత్రంబును, శ్రీముఖలింగనాయకుని సేవించి యచ్చటంగల విశేషంబులన్నియు నాకర్ణించి యిట్టిపుణ్యక్షేత్రంబులు దర్శింపనివారలమనుగడ మనుగడయే? అని తలఁచుచుఁ దనరాజ్యంబుఁజేరి సుఖంబుగఁ గాలంబుఁ గడుపుచుండె.

---

# 4. అనంతవర్మచోడగంగదేవుఁడు

పూర్వము కళింగదేశమును వజ్రహస్తదేవుఁ డను రాజేంద్రుండు పరిపాలించెను. ఈతఁడు మిక్కిలి బలవంతుఁడై తనకు సమకాలికులైన చేదిరాజులను జయించెను. ఇతనికి వినయమహాదేవియందు రాజరాజనుకుమారుఁ డుదయించెను. ఈ రాజరాజు బాల్యముననే యఖిలశాస్త్రవిద్యల నేర్చి తాను వయస్సువచ్చునప్పటికిఁ బరరాజులతో రణంబానరించి కీర్తిచంద్రికల నల్దెసల నింపఁ దొడంగె. కొంతకాలమైన పిదప నీరాజరాజు చోడరాజగురాజేంద్రచోళునికుమార్తె యగురాజసుందరిని వివాహమాడెను. ఈతని కీరాజసుందరియందు చోడగంగదేవుఁ డనుకుమారుఁ డుదయించెను. ఈరాజరాజుకుమారులలో నీతఁడే పెద్దవాఁడు. ఈతనికి సామాన్యముగా ననంతవర్మ యను పేరు వాడుకలో నుండుటంబట్టి యనంతవర్మచోడగంగదేవుఁ డనుపేరు వచ్చెను. ఈయనంతవర్మ సమస్తశాస్త్రములయందారితేరినవాఁడై యపరశేషుం డనుప్రఖ్యాతిఁ గాంచె. మఱియు రాజకీయవిద్యలం దితని కీతఁడే సాటియని చెప్పఁదగియున్నది.

రాజరాజు క్రీ. శ. 1069 నుండి 1077 వఱకుఁ గళింగ రాజ్యమును బాలించి పరలోకగతుం డైనపిమ్మట ననంతవర్మ చోడగంగదేవుఁడు కళింగనగరమునఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. మత్స్యవంశపురాజులు, మన్యప్రదేశములఁ బాలించురాజులు మొదలగువా రీతనికి సామంతులుగా నుండిరి. ఈతనితాతతండ్రులు మిక్కిలిబలవంతులు. వారికాలమున సామంతులుగ నుండినవా రీతనిపట్టాభిషేకమహోత్సవముఁ జూడనేగిరి. ఈతని కాలమునఁ గళింగనగరము మిగులఁ బ్రఖ్యాతిఁగాంచినది. ఆపట్టణమునందలిమేడ లాకాశము నొరయునట్లు నిర్మింపఁబడియుండెను. దానిప్రాకారములు మిక్కిలిదృఢములై శత్రువులకు భేదింపరానివిధంబున నొనర్పఁబడినవి. ఆపట్టణమునకుఁ జుట్టు గలయగడ్తలు సముద్రముల నిరాకరించియున్నవి. జనుల కెట్టికష్టములు లేకుండ మార్గములు విశాలములుగా నమర్పఁబడియున్నవి. ఆమార్గములయందు నక్కడక్కడ మార్గస్థుల విశ్రాంతికొఱకు మంటపము లేర్పరుపఁబడినవి. అచ్చటఁ గల పూలతోటలలో విహరించువారు నందనవనంబును దలంపక మానరు. అచ్చట సకలవర్ణములవారు తమతమవర్ణాశ్రమాచారంబులఁ జక్కగ నెరవేర్చుచుందురు. సప్తవ్యసనములందాసక్తిగలవా రానగరమునందుఁ గలికంబునకైనఁ గానరారు. వారి కేవిధమైనభయంబులును లేవు. ఆ పట్టణ మిట్లుండుటకు రాజపరిపాలనమే ముఖ్యకారణము. ఏవిద్య కావలయునన్నను జెప్పువా రనేకులు గలరు. ప్రాతస్సాయంకాలముల దైవప్రార్థనమునకై దేవాలయములు నిర్మింపఁబడినవి. ఆ యుద్యాన

వనములందు శుకపికశారికాది వివిధపక్షి సంతానంబులు విహరించుచుండును. చూచువారల కానందముం గొలుపుసరోవరంబులు పుండరీకవిరాజితంబులై చుక్కలగుమిఁతో నలరారు గగనంబు చందంబున వెలయుచుండును. ఏ వీథినైనను దప్పక నాటకశాలలు విరాజిల్లుచుండును. అట్లుండుటంజేసి జనులచ్చటికేగి సంగీతమును విని యానందించుచుందురు.

ఈరాజు ప్రజలను దనపుత్త్రులవలెఁ బాలించుచుండును. ఈతఁడు తనరాజ్యమునఁ బ్రజల కేవిధములగు కష్టములు లేకుండ రాజ్యపరిపాలనం బొనరించుచు నపరదేవేంద్రుఁడన విఖ్యాతిఁ బడసి న్యాయంబు దప్పక యెల్లవారలకుఁ దలలోన నాల్కవలె నటించుచు సత్కీర్తిఁ గాంచుచుండెను.

అనంతవర్మచోడగంగుని రాజ్యము తూర్పుతీరమున మిక్కిలి విశాలముగా వ్యాపించియుండెడిది. శత్రుభయంకరుఁడును, బహుపరాక్రమశాలియు నగునీతఁడు తనతాతయగు వజ్రహస్తుఁ కాలమున లోఁబడియుండిన చేదికాలచుర్యులు తన కాలమున స్వాతంత్ర్యములఁ బ్రకటించుటఁ గాంచి తాను వారి నణచుటకై బయల్వెడలెను. కాని రణరంగమునందు కర్ప్పగల కాలచుర్యులే సన్నోడించిరి. ఆలోపలఁ గులోత్తుంగుఁడు దక్షిణ కళింగమును జయించియుండెను. ఇట్లుభయకళింగములు కోల్పోయి భగవదనుగ్రహము లేనికారణమునఁ దా జయింప గలిగినంత పరాక్రమసంపన్నుఁడై యుండియుఁ బక్షహీనంబగు విహంగంబువోలె నూరకుండవలసివచ్చెను.

మఱియుఁ బశ్చిమోత్తరభాగంబులందు ఘుముసూరు మొదలగుమన్న సంస్థానాధీశులుగూడ నీతనిబలహీనత నాలించి యితని కెదురుతిరిగిరి. ఇట్లు పశ్చిమోత్తరరాష్ట్రములనుగూడఁ గోల్పోయి చోడగంగు జోగివంటివాఁడయ్యె. ఇంతపరాక్రమవంతున కిట్లగుటకు వేములవాడభీమకవిశాపమని కొందఱు తలఁతురుగాని యిందెంతనిజమో బోధపడఁజాలదు.

ఉ. వేములవాడభీమకవి వేగమె చూచి కళింగగంగు తా
సామునుమాని కోపమున సందడిదీరిన రమ్ము పొమ్మనెన్
మోమును జూడ దోసమిఁక ముప్పదిరెండుదినంబులావలన్
జామున కర్ధమం దతని సంపద శత్రులపాలుగావుతన్

కావున నీపద్యమందు వ్యవహరింపఁబడిన రాజు కళింగగంగీయనంతవర్మయేగాని మఱొకఁడు కాఁడు. కళింగదేశమును బాలించిన గాంగరాజులలో 'గంగు' అనునామముగలవాఁ డింకెవ్వఁడును లేకపోవుటయే యీకళింగగంగీతఁడే యనిచెప్పుటకుఁ బ్రబలకారణమై యున్నది. ఈతనికిఁ జోడగంగనునామంబు స్థిరాంకితమైనను జాలకాలము కళింగదేశమును బాలించుటచేఁ గళింగగంగనునామంబు వచ్చె. కావున నీతని భీమకవి తిట్టినాఁడనుటచే భీమకవి యీతనికి సమకాలికుఁడనియే చెప్పఁదగియున్నది. ఇట్లు నాల్గువైపుల రాజ్యము నామమాత్రావశేషమై యున్నను మిగుల ధీరుండగుటచే ననంతవర్మ నిరుత్సాహవంతుఁడు కాక యెప్పటికైనను బగతుర రూపుమాపి, కళింగసామ్రాజ్యముల స్థాపింపవలయునను నభిప్రాయముతో సైన్యమును గూర్చుకొనుట కారంభించెను. కళింగ

దేశము మొదటినుండి గజములకుఁ బుట్టినిల్లని ప్రసిద్ధిగాంచి నది. ఆదేశీయు లేనుఁగులను బట్టి వాని నలవాటుపఱచు కొనుటయందుఁ గడు నేర్పరులు. శత్రురాజులు కళింగగజంబు లకు భయపడుచుందురు. కాన నీవిషయంబుల విచారించి గజబలంబుల నాయత్తపఱచుటయందు మిక్కిలిజాగరూకత వహించి యాసైన్యమున కొకనాయకుని నియమించెను. పిమ్మట నీతనికుమారుఁడగు కామార్ణవదేవుఁ డశ్వసైన్యంబులకును నాయకుఁడయ్యె. చోడగంగరాజు మొదలగు పదాతి నాయకులు గుడివాడ మొదలగుగ్రామంబుల వాసంబుఁగా బంచుకొని పదాతిసైన్యముల సమకూర్ప మొదలిడిరి. అనంతవర్మ రాజ్యమునందు పర్యటనంబు గావించుచు నిఖిలజాతుల వారికి ననేకంబు లగుదానంబు లొసంగుచుఁ బ్రజల యాదరణంబునకుం బాత్రుఁడగుచుండె.

ఈలోపుగా క్రీ. శ. 1118 సం॥ నాఁటికే కులోత్తుంగుఁడు మరణించుటచేఁ జోళచళుక్యరాజ్యముల రెంటినిఁ బాలింపఁగలసమర్థుం డొక్కఁడును లేకపోయెను. అనంతవర్మ మొట్టమొదటఁ జాళుక్యులచే నోడింపఁబడినందున నాసమయంబునఁ గోపావేశపరవశుండై సమకూర్చుకొనినచతురంగబలముల వెంటఁబెట్టుకొని వేంగీరాష్ట్రమును జయించుటకై బయలుదేరిపోయి తన్నదుర్కొనునంతటిబలవంతులు లేనందున నాయుద్ధంబున విజయంబుఁగాంచి గోదావరివఱకుఁ గలప్రదేశమును దాను స్వాధీనముచేసికొని వెనుకకు మరలి భీమేశ్వరస్వామిని సేవించి యచ్చటఁ గొన్నిశాసనములు చెక్కించి తన

విజయంబులఁ బేర్కొనుచు దక్షారామమునఁ దనమంత్రులఁ గొందఱ నటనుంచి రాష్ట్రపాలనమునకుఁ దగినకట్టుబాట్లు కొన్నియొనర్చి పిమ్మటఁగూర్మనాథుని దర్శింపఁబోయి యచట నొకశాసనమును జెక్కించి పోయి కొంత కాలంబునకుఁ గొన్ని కారణములచేఁ దనరాజధానిం గటకమునకు మార్చుకొని తనవిశాలరాజ్యమును క్రీ. శ. 1077 నుండి 1149 వఱకు నేకచ్ఛత్రాధిపత్యముగాఁ బాలించెను. లోకమున సకలదేశములఁ బాలించినరాజులలో నీతనివలె 72 సంవత్సరములు రాజ్యమును బాలించినరాజేంద్రులు తక్కువ. అనంతవర్మ రాజ్యమున కేతెంచునప్పటికిఁ జిన్నవయస్సుగలవాఁడైనను దాను రాజ్యమును బాలించి పరలోకగతుఁడౌనంతకుఁ దనరాజ్యము తూర్పుకనుమలకును, సముద్రతీరమునకును, మధ్యభాగమునను, గంగానదిమొదలు గోదావరివఱకును వ్యాపమై విలసిల్లుచుండెను.

ఈతఁడు శివభక్తుఁడు. గాంగు లందఱును సామాన్యముగా శివభక్తులే. ఐనను వీనికి నితరమతములందు ద్వేషభావ మించుకేనియు లేదు. ఈతఁడు శివభక్తుఁడైనను విష్ణుదేవాలయములలోని కరిగి విష్ణుదేవునకు నర్చనాదివిధుల సమర్పించుభక్త శిఖామణి. ఈతఁడు తనరాజధానిని గటకమునకు మార్చుకొన్నప్పుడు బౌద్ధులకును, వైష్ణవులకును దగినవిధంబున నాలయంబులఁ గట్టించి దిగంతవిశ్రాంతం బగుకీర్తి గాంచెను. అనంతవర్మ రాజ్యపరిపాలనము మిక్కిలివిచిత్రమైనది. రాజ్యమంతయు ననేకవిధములుగా విభజించి యచ్చటచ్చటఁ గొన్నిమం

డలంబులఁగూడ నేర్పఱచి వానికి నధికారులనుగూడ సిద్ధపఱచి తా నప్పుడప్పుడు జరుగుచున్నవిషయంబుల నెఱుఁగుచుండెడి వాఁడు. గ్రామస్థుల క్షేమైన సౌకర్యములు గావలసివచ్చిన యెడల నాసమీపమం దుండుమండలేశ్వరుఁడో లేక రాజో వచ్చి యేర్పాటుచేయవలసియుండెను.

మఱియు నీతని కాలమునఁ గళింగ దేశము సర్వవిషయము లలో మిక్కిలి ప్రఖ్యాతిఁ గాంచియుండెను. కళింగము మొద టినుండియుఁ బేరుప్రతిష్ఠలు గాంచినదగుటచేఁ బరరాజు లెప్పు డు నాదేశముమీఁదికి దండెత్తసాగిరి. అందువలన నాదేశము లోఁ బ్రజలు చాలవఱకుభిన్నకులములవారై యున్నారు.కళింగ దేశీయులమత మొకటి కాదు. వారు సకలదేవతలను సామా న్యముగాఁ బూజింతురు. జావాద్వీపములోఁ గళింగుల శిల్ప చాతుర్యముఁ గాన్పింపఁజేయుకట్టడము లిప్పటికిని విరాజిల్లు చున్నవి. అనంతవర్మచేఁ గట్టింపఁబడినజగన్నాథుని యాలయ ముపై నొకరాజేంద్రుఁడు పడవప్రయాణము చేయుచున్నట్లు నిర్మింపఁబడినవి. ఇట్టి వనేకములు గలవు. వీనింబట్టిచూడఁ గళిం గులకు శిల్పనైపుణ్యమెక్కుడని పొడగట్టుచున్నది. దేవాలయ నిర్మాణమున వారు దాక్షిణాత్యులపద్ధతులుగాక యత్యాశ్చ ర్యంబులుగల శిల్పచాతుర్యంబుల వెల్లడింపఁజేయుదురు. దక్షి ణదేశమున నెచ్చటను లేని శిల్పము గళింగులు చూపఁ గడంగిరి. మఱియు వీరు క్రీ. పూ. 10 వ శతాబ్దమునుం డియు నోడలవర్తకమునందుఁ బేరుఁగాంచిరి. వీరి కిట్టివిద్యా చాతుర్య ముండుననుస చరిత్రకారులు చెప్పుటయేకాక యందం

దుఁ గల శిల్పములచేఁ దెలియఁబడుచున్నది. ఇట్లనంతవర్మచోడ గంగదేవుఁడు 72 సంవత్సరములు న్యాయంబుదప్పక రాజ్యం బుఁ బాలించి సత్కీర్తిచంద్రికల నల్దెసల నింపి కృతార్థుండయ్యె.

---

## 5. ఇంద్రవర్మ

తొల్లి కళింగదేశమును బరిపాలించినరాజులలో నీయింద్రవర్మ చాలప్రసిద్ధుఁడు. ఈతఁడుకూడ గాంగకుల తిలకుఁడు, నిఖలకళింగదేశాధీశ్వరుఁడునై వన్నెకెక్కె. ఈతనికాలములో నీదేశమునకుఁ జుట్టుపట్ల ననేకు లనేకరాజ్యములను బాలించుచుండిరి. ఐనను వారందఱిలో దానార్ణవునికుమారుం డగునీయింద్రవర్మ లోకోత్తరంబైన మహిమగలవాఁడును, విశాల మగుయశస్సుచేఁ బ్రకాశించువాఁడునై యుండెను.

ఈతఁడు పరిపాలనావిషయమున మిగుల జాగరూకత వహించి ప్రజలఁ దనబిడ్డలచందంబున వారికష్టసుఖంబుల విచారించుచు నీశ్వరభక్తిగలిగి దానకర్ణుండని ప్రఖ్యాతిఁ గాంచి న్యాయమార్గంబున రాజ్యం బేలుచుండె. ఈతఁడు రాజ్యరక్షకులగు కొంతమందిసైనికుల సిద్ధపఱచి తనదేశమునం దుంచెను. ఈతఁడు పుణ్యదినములలోఁగాని, తదితరసమయము లందుఁగాని యనేకుల కనేకభూదానము లొసంగినట్లు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. కళింగదేశము గజంబులకు సుప్రసిద్ధమైనదగుటచే నీరాజేంద్రుఁడు బలిష్ఠంబులైన పెక్కు

గజంబులఁ జేర్చి వానిరక్షణముకొఱకుఁ గొంతమంది మావటీ వాండ్రను బెట్టెను.

ఆదేశంబున సౌధశిఖరంబు లాకసంబున సంచరించు మేఘంబుల రాచుకొనుచుండును. అచ్చటిప్రాకారముల యౌన్నత్యంబు చెప్ప నలవిగాదు. అచ్చట శత్రురాజులు రాకుండుటకై కందకములు సముద్రంబులంబోలి కన్పట్టుచుండును. ఫలపుష్పసమృద్ధము లగునుద్యానవనంబు లాదేశంబున నెంతయో సొంపు గలిగియుండును. ఈతం డొసంగిన యొక శాసనముమీఁది నందివిగ్రహమునుబట్టి చూడ నితఁడు తప్పక శైవమతస్థుఁడని తెలియక మానదు. అనేకములగు దేవాలయముల కితఁ డాచంద్రతారార్కస్థాయిగాఁ గైంకర్యము జరుగుటకు భూదానంబు లొసంగినవాఁడని యీతని కొన్ని శాసనములవలనఁ దెలియఁబడుచున్నది. ఈతఁడు దయగలవాఁడును లోకంబునకు మేలుచేయువాఁడునై యుండెను. ఈతనిదైవభక్తి సాటిలేనిది. ఇతనియన్యమతసహాన గుణ మదృష్టపూర్వము. ఈతఁ డొనర్చుకార్యములు లోక శుభంకరములు, దైవప్రీతికరములు నగుచున్నవి. ఈతఁ డందఱియందును సమభావముతోఁ బ్రవర్తించువాఁడు. మతభేదమును గమనింపక తగినవారిని రాజకీయోద్యోగములందు నియమించువాఁడు. తల్లిదండ్రులపుణ్యాభివృద్ధికై యేపన్నులు లేకుండ ననేకభూములను వేదవేదాంగపారంగతులైనవిప్రవరులకు దానమొసంగెను. కొన్నికొన్ని శాసనముల ననుసరించిచూడ నీశాసనకాలములోఁ గళింగదేశమునఁ బ్రజలు తెలుఁగుభాష నే

వాఁడుచుండిరని నమ్మఁదగియున్నది. కొన్నికొన్ని శాసనములు సంస్కృతభాషయందును గలవు. ఆతనిరాజ్యకాలమునఁ జీనాదేశపుబౌద్ధయాత్రికుఁ డొకండు హిందూదేశములోనివగు నుత్కళకళింగాంధ్రపల్లవరాజ్యంబులందుఁ బ్రచారమొనరించుచు బౌద్ధహిందూజైనమతములబలాబలములగుఱించియు రాజ్యాంగపరిస్థితులనుగుఱించియు, రాజ్యరాజధానులవిస్తీర్ణమును గుఱించియుఁ దాను జూచినట్టివిషయములను దనభాషలో నున్నది యున్నట్లు వ్రాసికొనెను.

దీనింబట్టిచూడ బౌద్ధమతమునందువలె హిందూమతములోఁ గూడ ననేకశాఖలున్నట్లు తనగ్రంథమున వ్రాసెను. వీనినన్నింటిని ననుసరించిచూడ హిందూదేశమందు బౌద్ధహిందూజైనమతములు మూఁడును బ్రబలియుండెను, గాని ముఖ్యముగా దక్షిణహిందూదేశమునను, గౌడవంగదేశంబులను, బౌద్ధమతముకంటె హిందూమతమే మిక్కిలివృద్ధిగ నుండెననియు, బౌద్ధచైత్యములకంటెను బౌద్ధమతస్థులకంటెను, హిందూదేవాలయములు, హిందూమతస్థులు మిక్కిలి ప్రబలియుండిరనియు వ్రాసియున్నాఁడు.

అప్పుడు బౌద్ధహిందూదేవాలయములు దేశమునందంతటను బ్రబలియున్నవి. ప్రసిద్ధిఁ జెందిననాగార్జునుం డోఢ్రకళింగదేశములను మహాయానబౌద్ధమతశాఖలోనికిఁ బ్రవేశింపఁజేసెను. ఈకాలమున మాళవదేశపురాజగునింద్రద్యుమ్నుఁడు దంతపురిం బ్రవేశించి బౌద్ధహిందూమతముల వదలుకొని నూతనం బగువైష్ణవమతమును స్థాపించెనని కొందఱియభి

ప్రియము. కావున నప్పటినుండియు దంతపురి, లేక జగన్నాథము, బౌద్ధహిందూమతస్థుల కెల్లరకును, బుణ్యక్షేత్రమై విరాజిల్లుచున్నది. బుద్ధుఁడు విష్ణునియవతారమని తలఁచి భక్తిశ్రద్ధలతో వారు పూజింపసాగిరి. మౌర్యులకాలములో బౌద్ధమతముల నంగీకరించి యాచరించుచుండినకళింగదేశము గుప్తరాజులకాలమున హిందూమతమును, దత్తసంప్రదాయముల నాచరింపసాగెను.

ఈరాజేంద్రుఁడు న్యాయమార్గప్రవర్తకుఁడై రాజ్యము పాలించుచుండ నొకానొకరోజున నొకయాత్రికుఁడు నిఖిల తీర్థయాత్రలను సేవించుచు నిఖిల దేశములం గలవిశేషంబులఁ గాంచుచుఁ దుదకు మార్గవశంబునఁ గళింగదేశముం జేరి యట నొకయూర నొకసత్రంబున నివాస మేర్పఱచుకొనియుండెను. ఆయాత్రికుఁడు సర్వమంత్రవేత్తయను విషయంబు నాయూర నొకవిప్రుం డాలించి యెవ్వరో యొకమహామంత్రవేత్త యీయూరికి వచ్చి సత్రంబున నివసించినాఁడఁట; మనయింటఁ గలపిశాచముల బాధలు తొలఁగించునేమో వానిం బిలిచి విచారింతమూయని భార్యతో ననె నామె యందులకు సమ్మతించెను.

అంతట నాబ్రాహ్మణుం డాసత్రంబున కేగుదెంచి యాయాత్రికునకు నమస్కరించి "అయ్యా! తమరు మంత్రశాస్త్రవేత్తలలో మిగులఁ బ్రఖ్యాతిఁగాంచినవారని వింటిని. అప్పటినుండియు నామనంబు తహతహలాడఁ దమసాన్నిధ్యమున కరుదెంచితిని. మాయింట నస్తమానమైనది మొదలుకొని

సూర్యోదయమువఱకు నిద్రించుటకుఁ బ్రాప్తిలేదు. అనేకము లగు భయంకరములైనభూతములు మాయింటిలో నింటిచుట్టున సంచరించుచుఁ గన్నుమూసినఁ బైనెక్కి నాట్యములాడుచున్నవి. కట్ట దాపున నుంచుకొని మేల్కొన్నయంతవఱకు మీఁదికి రావు. కావున నీబాధతో మాయవస్థ చెప్ప నలవిగాకున్నది. మాయందు దయగలిగి మా బాధల నివారింపుఁడు. మేము మా శక్తివంచనలేకుండ మిమ్ముల సన్మానింతుము. మీరు లోకము లోనిభూతబాధల నిర్వర్తింపఁజేయుట కవతరించిన భగవంతుని వలెఁ దోఁచుచున్నారు. ఈమాట నిక్కువము. కావున నెట్లైన మముద్ధరింపఁజేసి మాబాధలఁ దొలఁగింపవలయునని ప్రార్థించె.

అందుల కాయాత్రికుఁడు విప్రోత్తమా! నే నొక చోటనుండి యిట్టిబాధల నిర్వర్తింపఁజేయుట కిది సమయము గాకున్నది. నేను యాత్రిలు దేశములు సేవించుచు నీదేశ మునఁ బ్రఖ్యాతిఁగాంచిన శ్రీముఖలింగనాథుని సేవింపవలె నను నభిప్రాయముతో నిటకు వచ్చితిని. ఒక్కొక్కచోటఁ బదేసిరోజు లుండుట కవకాశ ముండదు. మరల నిరువదిరోజు లలో నింటి కేగవలయును. మాపుత్రుని వివాహము వచ్చు చున్నది. ఆవిషయమైన ప్రయత్న మొనరింపవలయు ననెను. అందుల కావిప్రోత్తముం డాయాత్రికుని వచనము లాలించి "అయ్యా! మీరును బ్రాహ్మణులు, మేమును బ్రాహ్మణులము. మనయుభయులశాఖకూడ నొక్కటియే. కావున విచారింప వలసినంత కష్టము లేకుండ మాపుత్రికను మీ కుమారున కిచ్చి వివాహ మొనరించెద. తా మీ మా బాధల నిర్వర్తింప

వలయునని యనేక విధంబులఁ బ్రార్థింప నాయాత్రికుండు తన కుపకారము గాఁగలదని యూహించి రేపు మీరందఱు నావెంట బయలుదేరి శ్రీముఖలింగనాథునికోవెలకు దాపుననున్న వంశధారానదీతీరంబునకు వచ్చి యచ్చట నానదియందు స్నానమొనరించి యాస్వామిని సేవించి యింటికి రండు. పిమ్మట మీకార్యము నేను నిర్వర్తింతు నని చెప్ప నావిప్రోత్తముం డట్లె యని మఱునాఁడు వానివెంట బయలుదేరి వంశధారానదీతీరంబున కరిగి యట స్నానమొనరించి ముఖలింగనాథుని సేవించి కుటుంబసహితుండై యింటి కరుదెంచె.

అంతట నాయాత్రికుఁడు వీనివెంట నంటివచ్చి యాగృహంబునఁ దా నారాత్రి జపంబుఁజేయుచుఁ గూర్చుండినకొలదికాలములో భయంకరములగు ననేకభూతంబులు కేకలు వేయుచు నాయింటిలోపలను జుట్టుపట్లను గ్రమ్ముకొని వికృతాకారంబులతో నాట్యంబులు సల్పఁబ్రారంభించెను. అప్పుడావిశేషంబుల నాతండు చూచి యొక్కక్షణంబులోఁ దన మంత్రబలంబున నాభూతసంతానంబులఁ బాఱద్రోలి యాయింటికి మరల నెప్పుడును, భూతంబులు ప్రవేశింపకుండ ద్వారంబులకు యంత్రములు కొట్టి వారలబాధలనన్నిటి నిర్వర్తించి తనయూరికిం బ్రయాణమైపోవుచుండెను. బ్రాహ్మణుఁడు "స్వామీ! నీవు మాపాలిటిదేవుఁడవుగాని మానవుండవు గావు. కావున నే నన్నువిధంబున నాబిడ్డను మీకుమారున కిత్తు. ముహూర్తమును నిరూపించుకొనిపోవుఁడనెను. అందుల

కాయాత్రికుండు సంతసించి వివాహసుముహూర్తంబును నిశ్చయించుకొని తనదేశంబున కేగి యీవృత్తాంతం బంతయుం దనభార్యకును జుట్టములకును జెప్పి కావలసిన ప్రియత్నము లాచరించి కళింగదేశమున నావిప్రుం డున్నగ్రామంబున కరుదెంచి వివాహకార్యంబును నిర్వర్తించుకొని మరలి తన యూరికిం బోవుచుండ నింద్రవర్మ యీసమాచారంబు నాలించి వానినిం బిల్వనంపి తమ కేయేవిద్యలయందుం బ్రవేశంబుగల దన నీతండు నా కింద్రజాలాదివిద్యలలోం బ్రవేశమున్న దని వచించె.

అంతట రా జీమైంద్రజాలికు నుంచి మిగిలినవారి నందఱిని సాగనంపి మఱునాడు సంస్థానమున నింద్రజాలవిద్య యొక్క మహాత్మ్యనిచేం బ్రదర్శింపంబడుంగానంజూడందలంచినవారు రావచ్చునని చాటింపు చేయించెను. సాయంకాల మగునంతకుం బౌరు లందఱు విచ్చేసిరి. రాజు సింహాసనము నలంకరించి తన దాపున వీనికి సింహాసనము వేయించెను. అప్పు డీతండు రాజేంద్రుని సభ్యులను వీక్షించి నేను మీకిప్పుడు రామాయణ భారతయుద్ధములం జూపింతునని చెప్పి యందఱిని గనులు మూసికొమ్మనెను. అంతట వారట్లుచేసి వెంటనే కన్నులు దెఱువం దాముస్న పట్టణముగాకుండ నచ్చోట యుద్ధరంగమైనట్లు కాన్పించి యొక వైపున భారతయుద్ధమును, మఱియొక వైపున రామాయణయుద్ధమును జరుగుచున్నట్లు కనంబడెను. మఱికొంతవడికిం గృష్ణుండు కంసుని శిరశ్ఛేదనం బొనరించు నట్లును, పిమ్మట నాపట్టణమున నాల్గువీథులు నిప్పుమంటలతో

మందుచున్నట్లు కాన్పించెను. తరువాత మరల వారలఁ గన్ను లుమూసి తెఱువుఁడన వారట్లు కావించి చూచి యేమియు లేక పోవుటచే నిది యింద్రజాలవిద్యా మహిమంబేయని వాని నెంతయో శ్లాఘించిరి.

అటుపిమ్మట నీయైంద్రజాలికుఁడు తనకుం గల యగ్ని స్తంభన జల స్తంభనాది విద్యలం జూపింప నింతవానిని మరలఁ గానమని రాజుగారు వేనోళ్ళ శ్లాఘించి వానికి వేయి నూటపదియారులు బహుమానంబు లొసంగి నగరంబునఁ బెద్ద యుత్సవంబుఁ జేయించి పంపుచు నాతని కొక యగ్రహారంబుఁగూడ నిచ్చెనఁట. అంతట నీబహుమానంబుల నందికొని యాతండు తనయూరికి వెళ్లినాఁడఁట. ఈకథ కళింగ దేశమునఁ గొందఱు చెప్పుదురు. వీనిసత్యాసత్యంబులు గుర్తెఱుంగుటకుఁ దగినప్రమాణంబులు గాన్పించనందున నిది పుక్కిటిపురాణ మని చెప్పవచ్చునుగాని కొన్నికొన్నిచో ట్లీయింద్రవర్మ యిచ్చిన దానశాసనములకుఁ బ్రమాణము లుండుటంబట్టి యైంద్రజాలికునకిచ్చిన యగ్రహారమును సత్యమని యే చెప్ప వలసియున్నది కాని యీయనికాలంబున నిట్టి యింద్రజాలాది విద్యానైపుణ్యముగల విప్రుఁ డొకఁడుండెనని కాని వాని కగ్రహారం బితం డొసంగెనని కాని కింవదంతి దప్పఁ దగునాధార ము లీతవఱకుఁ జిక్కకుండినవి. ఎట్లైన నీభూపాలుఁడు పుణ్యాత్ముఁడును, దైవభక్తి విశారదుఁడును, దానకర్ణుండు నను విఖ్యాతిఁగాంచి నల్దెసలఁ దననిర్మలకీర్తిచంద్రికల నింపె.

మఱియు నితని కాలమందుఁ బ్రజలు కల్లోలములు లే కుండ సోదరభావముతోఁ బ్రవర్తించెడివారు. ఈతఁడా దేశమును బాలించినంతవఱకు ననేకులు పండితులు వివిధవిద్యావిశారదులై కళింగదేశమునఁ జాలఁ బ్రసిద్ధికెక్కఁ బండితప్రియుఁడై యింద్రవర్మయను రాజేంద్రుఁడు పాలించుచుండెనట. అప్పటికిఁ బోయిన మనదారిద్ర్యము తీరునని వచ్చుచు నీతని దర్శించి లాభమొంది పోవుచుండెడివారు. కావున నితఁడు నిఖిలవిద్యాభిమానియై మతకల్లోలములు లేకుండ నొనర్చి వచ్చినవారివిద్యలఁ బరీక్షించి యెవరివిద్యలకుఁ దగిన బహుమానము వారల కొసంగి ప్రఖ్యాతిఁ గాంచుచుండెను వాఁడు.

ఈతఁడు తనకాలమున ననేకదేవాలయములకు శాశ్వతనిత్యనైవేద్యదీపారాధనలు జరుగు నిమిత్తమై వందలకొలఁది భూదానము లొసంగి ధర్మైకతత్పరుండై నిజుపేదలకుఁ గల్పవృక్షంబు చందంబున రాజ్యపరిపాలనం బొనరించుచు నితర సామంతరాజులపై విశేషంబులగు కప్పంబుల విధింపక యెల్ల వారికిఁ దలలోన నాల్కయై ప్రవర్తిల్లుచుండెడివాఁడు. ఇట్టి సద్గుణగణంబుల విరాజిల్లు నీయింద్రవర్మను దలంపనిమానవుం డరుదు. అట్టితఱిఁ గళింగదేశం బంతయు నేకల్లోలములు లేక శాంతంబై సకలవైభవంబుల వన్నెకెక్కి యమరసురలోకంబన విరాజిల్లుచుండె. ఇట్లుండుట కంతయు రాజపరిపాలనమే ముఖ్యమైనది. "యథా రాజా తథా ప్రజా" రాజెటువంటి వాఁడో ప్రజలు కూడ నట్టివా రగుదు రను సామెత సార్థకమైనది. ఇంద్రవర్మ యెట్టియాచారము

కలవాఁడో ప్రజలుకూడ నట్లే వర్తించుచుండిరి. కావున నీతని పరిపాలన కాలంబున దేశమునం దేయుపద్రవములు లేవు. క్షామంబు సున్నయయ్యె. జీవనంబునకు జరుగక భిక్షాటన మొనరించువారేరైన నుండిరేని వారికిఁదగినవృత్తులు గల్పించి జీవనాధారంబు గల్పించువాఁడు. మూకబధిరాంధపంగ్వాది జనంబులకుఁ బ్రత్యేకంబుగ నన్నసత్రంబు లేర్పఱచి పోషించు చుండెను.

మఱియు నప్పట్టణంబున నచ్చటచ్చట వీథికి రెండు మూఁడు నాటకశాలలు గలవు. యాతాయాతజనంబు లందలి గానంబులు విని సంతోషించి పోవుచుందురు. సాయంకాలము విహారార్థ మరిగి నాగరికులు సంచరించుటకుఁ బ్రత్యేకంబు గఁ బట్టణంబునకు బాహ్యప్రదేశంబున విశాలములగు పూల తోట లేర్పఱుపఁబడినవి. అందుఁ బట్టణములోనివారే కాక పొరుగూళ్ళనుండి వచ్చిపోవు వారందఱును మార్గాయాసంబు దీర్చుకొనుటకై యాతోటలలోఁ గమ్మని పూఁదావులచే విరాజిల్లు నికుంజంబుల విశ్రమించి యందలి కొలనిలోని నీళ్ళు ద్రావి యుపొంగి యిట్టితోటలు వేయించినవారు చాలఁ బుణ్యాత్ములని యారాజేంద్రుని శ్లాఘించుచుఁ బోవుచుందురు. అప్పురంబున జార చోర భయంబులు లేవు. దేశము సుభిక్ష ముగాఁ బ్రకాశించుచున్నది. ఆకాలంబున నన్నివసతులకు నఖిలదేశములలోఁ గళింగదేశము మిక్కిలి వన్నెకెక్కినది.

మఱియు దేశదేశంబులవారు, యాత్రికులు, నాదేశంబు నకు వచ్చి యచ్చటఁ గలవింతలు పరికించి యరుగుచుండెడి

వారు. ఇట్లు లోకులచేఁ బొగడ్తఁగాంచి సకలభోగభాగ్యంబుల నిందు్రని ధిక్కరించుచు, దుర్మార్గుల శిక్షించుచు, సాధువుల రక్షించుచు, నితరదేశములకంటెఁ దనదేశము మిక్కిలి సౌఖ్యకరమైనదిగా నొనర్చుచుఁ, బ్రజాదరణతత్పరుఁడై, శత్రుజనభీకరుఁడై క్షాత్రధర్మంబుల విచారించుచు రాజ్యాంగములందు జాగరూకతతో మెలంగుచు, ధర్మమార్గప్రవర్తకుఁడై చంద్రవంశతిలకుం డగుధర్మరాజు చందంబునఁ బ్రజలఁ బుత్రులవలెఁ గష్టసుఖంబుల విచారించి రక్షించుచు రాజ్యపరిపాలనం బొనరించి తనకీర్తి దశదిశల నింపి లోకవిఖ్యాతి గలరాజ వీరుఁ డనునామంబున విరాజమానుండయ్యె. ఇట్టివారిచరిత్రంబులం బొగడ నింద్రాదులకైనఁ దరంబుగాదుగదా!

## 6. సవరలు - కోయలు.

ఈ సవరలు ప్రాచీనకాలమునుండి యనాగరకులైన మోటుజాతివారనియు, మహారణ్యములందును, కొండలయందును, నివసించి జీవనముఁజేయుచుండురనియుఁ జరిత్రలవలనఁ దెలియుచున్నది. వీరిని రాక్షసులుగను, గ్రామ్యాదులుగను, బ్రాచీనులు వర్ణించిరి. వీరు పురాణముల ననుసరించి నిషధజాతివారనియు, మసిబొగ్గును బోలునల్లనిశరీరము గలవారనియు, వికృతాకారులనియు, వింధ్యపర్వతప్రాంతనివాసులనియుఁ దెలియవచ్చుచున్నది. కొన్నికొన్నిచోట్ల నాంధ్ర, శబర పుళిందాదిజాతులవారు కౌశికునిసంతతివారనియు, నాటనిశాప

మువలన నార్యాశ్రమముల సరిహద్దులలో నుండి దస్యులను నామాంతరములచేఁ బిలువఁబడుచుండిరనియుఁ జెప్పఁబడి యున్నది.

శ్రీమద్రామాయణమునం దీశబరులను విశ్వామిత్రునితోఁబోరుటకై వసిష్ఠుఁడు తనకామధేనువునుండి పుట్టించెనని చెప్పఁబడినది. మఱియు రాముఁడు దక్షిణాపథమున కేతెంచి నప్పుడు శబరి చేసినయాతిథ్యమును గైకొనెనని చెప్పఁబడినది. కావున నీపురాణములంబట్టిచూడ వీరు ప్రాచీనకాలమునుండి యుండిరని తెలియుచున్నది. స్కాందపురాణములో వామదేవుండు హిమవన్నగప్రాంతంబున యజ్ఞం బాచరించుచుండ గర్వాంధులైనగంధర్వులటకు వచ్చి శబరాంగనలచే మోహింపఁబడి వారు శబరాలయంబులఁ బుట్టునట్లాతనిచే శపింపఁబడిరనియుఁ బిమ్మట నీశ్వరాజ్ఞచే వారట్లు కళింగదేశమునం గలమధూకవనంబున శబరాలయంబుల జన్మించి తుదకు నీశ్వరసందర్శనమున శాపమోక్షణం బంది గంధర్వులై తమలోకంబున కేగిరనియుఁ జెప్పఁబడియున్నది.

మఱియు నిప్పుడీసవరలు గంజాం, విశాఖపట్టణము మొదలగు జిల్లాలలోని మన్యప్రదేశములందును, గోదావరికి సమీపంబున నుండు భద్రాచలముతాలూకాలోను, జెంచులను పేరఁ గృష్ణా నెల్లూరు జిల్లాలలోను గాన్పించుచున్నారు. వీరిలోఁ గొండసవరలు, కాపుసవరలు నని రెండుజాతులు గలవు. కొండసవరలనఁగాఁ దమ పూర్వాచారముల వీడక శైలములందు నివసించుచున్నారు. కాపుసవరలనఁగాఁ బూర్వా

చారంబులఁ బరిత్యజించి నాగరకులై పల్లపుప్రదేశములందు నివసించుచున్నారు. కొండసవరలు, లంగోటాలు బిగించి తలపాగలను జుట్టుకొని యందుఁ గొంగయీకలు దాల్చి ధనుర్బాణములు చేఁబూని వనంబులందుఁగాని, కొండలయందుఁగాని, వేటయందు మిగుల నాసక్తులై సంచరింతురు. వీరిలో వృత్తుల ననుసరించి, కుండలుచేయువారికిఁ గుంభసవరలనియుఁ గమ్మరము చేయువారికి లోహసవరలనియు, భేదము లనేకములు గలవు. వీరందఱు నడవిజాతివారే.

వీరు సామాన్యముగాఁ దమయిండ్లను నదీప్రాంతంబులందుఁగాని, పర్వతప్రాంతములందుఁగాని, వనమధ్యప్రదేశంబులందుఁగాని, కట్టుకొందురు. ఇండ్లకు గవాక్షములు మొదలైనవి లేక ముందరిభాగముననే యొకచిన్నవాకిలి యుండును. వీరు కత్తి విల్లు నమ్ములు మొదలైన తమ యాయుధముల నిండ్లకప్పులలో దాచిపెట్టుకొందురు. వీ రరణ్యములందు నివసించుచు బాటసారులకు శార్దూలాదిఘాతుకమృగోపద్రవములు లేకుండఁ ద్రోవలు బాగుచేయుదురు. అడవులను నఱికి వానినిఁ బొలములవలె నేర్పఱచుకొని సెలయేళ్లను బాటల కుపయుక్తములగునట్లు చేసికొందురు. వీరు వ్యవసాయము చేయుటలో మిక్కిలిసమర్థులు. రాగి, సజ్జ, జొన్న, మొదలగు మెట్టపంటలను గూరగాయలను విశేషముగాఁ బండింతురు. వీరిలోఁ గొందఱు బుట్టలల్లుట, కుండలుచేయుట, మొదలగు చేతిపనులయందు సమర్థులై వానివలననె జీవించుచుందురు. కొందఱు వేటాడుటయందు సమర్థులై పశువులను బట్టి య

మ్ముకొని జీవింతురు. మఱికొందఱు కొయ్యవ్యాపారమువలనను, నరణ్యములను గొట్టికఁడించినపంటలవలనను జీవించుచుందురు.

మఱియు వీరికి సరియైనజాతకర్మయున్నట్లు కాన్పింపదు. దిననామములనుబట్టిగాని, యుద్యోగస్థులనామములను బట్టిగాని పిల్లలను బిలుతురు. ప్రతిజాతికిని బెద్దయొకఁడుండి తమ జాతిలోఁ గలుగుసర్వవిధంబు లగుకలహములను దీర్చుచుండును. సవరలు తమగ్రామములలో నేవైన వ్యాధులు సంభవించినయెడల నావ్యాధులు గ్రామదేవతలకోపమువలన సంభవించినవని తలఁచి యాదేవతలను శాంతింపఁజేయుటకై తమ పురోహితులను బ్రార్థింతురు. ఆపురోహితులు స్త్రీవేషములతో నాదేవతలకోపమును దీర్చుటకై తగినమంత్రములనుచ్చరించుచుఁ గానుకల సమర్పించుటయేకాక, కోళ్ళు, దున్నపోతులు, గొఱ్ఱెలు, మేఁకలు మొదలైన జంతువుల బలిదీయుదురు. తమపురోహితులు మంత్రంబులందు మిగులసమర్థులని యెఱిఁగి తాము గృహంబులు కట్టుకొనఁబోవునపుడును, బొలములో విత్తనములఁ జల్లఁబోవునపుడును, బెండ్లిండ్లు మొదలగు పనులయందును వీరిసలహాలు కోరి వీరు చెప్పిన ట్లాచరించుచు నట్టిసమయంబులఁ దగువస్తువులుగాని, ధనముఁగాని, యిచ్చి వారిమెప్పు వడయుదురు.

వీరిలో నొక్కఁడు పెక్కుమందిస్త్రీల వివాహమాడ వచ్చును గాని, యొక స్త్రీ పెక్కురుమగవారల వివాహమాడఁగూడదు. వీరు దమకుఁ గలుగుకష్టములుగాని రోగములుగాని యేదో యొకదేవతాకోపమున సంభవించినవని

భావింతురు. వీ రరణ్యములలో సంచరించునప్పుడు మొలకు లంగోటాలఁ గట్టుకొని శిరంబునఁ బాగాలు చుట్టి యా పాగాల యందు నెమలికన్నులుగాని బాతులయీకలుగాని, ధరింతురు. పెండ్లిండ్లుగాని పండుగలు మొదలైనవిగాని వచ్చినప్పు డుత్తరీయ ముల వేసికొందురు. ఇవ్విధంబున స్త్రీలుకూడఁ గ్రిందిభాగమున నెట్టివో చిన్న పేలికలు కట్టుకొన్నను, మఱియొక గ్రామమునకు వెళ్లవలసివచ్చినప్పుడుగాని పెండ్లిండ్లసమయమునఁగాని చీరెల ధరింతురు. సామాన్యముగా వీరు మెడయం దిత్తడికంటెలు, చేతు లకు గాజులు మొదలగునవి ధరింతురు. వెండ్రుకలు వెనుకకుఁ ద్రిప్పి కట్టుదురు. ముఖ్యముగాఁ జేతులయందుఁగాని, ముఖము లందుఁగాని, చెక్కిళ్ళయందుఁగాని పచ్చఁ బొడిపించుకొందు రు. కొండసవరలు సామాన్యముగా గంగి, ముత్యాలమ్మ, పోతురాజు మొదలగు గ్రామదేవతలను బూజింతురు. తమ గ్రామములలో విషూచ్యాదిరోగములు తటస్థించినప్పు డీదేవతలఁ జిన్నగుడిసెలయం దుంచి వానికిఁ బూజ లర్పించి తుదకుఁ బసువులు మొదలగుజంతువులఁ దెచ్చి బలియిత్తురు. వీరికి క్షుద్రదేవతలం దాసక్తి మెండు.

ఈసవరలు సారాయి మొదలగు మత్తుపదార్థములం ద్రాగుటలో మిగుల సమర్థులు. వీరు సర్పములను దిందురు. వీ రరణ్యములలో సంచరించుటవలనఁ జెట్టుక్రియలు వీరికి బా గుగాఁ దెలియును. పాము కాటునకు నమోఘమైనపనిఁ జేయు దురు. వీరు చెట్టుమూలికలవలనను, బసరులవలనను, జాల రోగంబులు కుదుర్చుదురు. ఈసవరల కిటీవల మనప్రభుత్వము

వారు కొన్ని పాఠశాలల నేర్పఱచిరి. విద్యయం దాసక్తిగల వారు కాకపోయినప్పటికి వీ రుద్యోగములం దపేక్షతోఁ జదువుచున్నారు. అట్టివారికిఁ బోలీసుశాఖలో నుద్యోగములు దొరకుచున్నవి.

కోయలు నైజామురాజ్యములోనియరణ్యములందును బర్వతములందును నివసించుచున్నారు వీరును సవరలవలె వనవాసులనియు, శైలవాసులనియుఁ జెప్పఁబడుదురు. వీరు వనముల చెంత నుండుసెలయేళ్ల ననుసరించుకొని జీవించుటవలన నానదీ ప్రాంతములే కాపురములనియుఁ జెప్పవచ్చును. వీరుండుగృహములు తాటియాకులతోఁగాని తెల్లుగడ్డితోఁగాని జమ్ముతోఁగాని కప్పఁబడియుండును. వీరు తమయిండ్లు కట్టుకొనుటకుముందు దమకులములోఁ బెద్దవానికి నాస్థలముఁ జూపించి యేయాటంకములు లేవని వానివలనఁ దెలిసికొనిన పిమ్మట నిండ్లు కట్టుకొన నిశ్చయింతురు. మొట్టమొదటఁ గొండదేవతలను, గ్రామదేవతలను బూజించి యాదేవతలకుఁ బ్రీతిపూర్వకముగాఁ గొన్ని పశువులను బలియిచ్చి తాము విందుల నారగించిగాని కట్టుటకుఁ బ్రారంభింపరు. వీరు పశువులను బెంచుదురు. వీరికిఁ బశువులే ముఖ్యమైనధనము. వీరిపశువులకు నాశ్చర్యకరంబు లగునామంబు లుండును. వీరు పశువుల నొక్కపూటమాత్రమే పాలుపితుకుదురు. ఆపశువులు పగలంతయు నడవులకేగి తమ కిష్టమువచ్చినట్లు గడ్డిమొదలైనవి తిని సెలయేటినీళ్లు ద్రావి సాయంకాలమగునప్పటికిఁ దమ నివాసములకు వచ్చిచేరును.

ఈకోయలు రాత్రులందుఁ దమపశువులు బెబ్బులులు పాల్పడకుండ వానిని వెదురుతడలక్రింద నుంచి కాపాడుదురు. ఆవులపాలు, మేకలపాలు, మొదలైనవి త్రాగుటయేగాక యొకానొకప్పుడు వానినిఁ జంపి వచ్చినమాంసమునే భుజింతురు. వీరు పశువులను విశేషముగాఁ జంపుదురు. వీరిపశువులడవులయందు మేతమేసినప్పటికిని బన్నులుగాని, యితరములగు నేయభ్యంతరములుగాని యుండనేరవు. ఈకోయలలో గుట్టకోయ లనువారు మన్యప్రదేశములందు నివసించి యడవి పంటలను బండించి వానివ్యాపారమే ముఖ్యవృత్తిగాఁగలవారైయున్నారు. వీరు వనములందుండి కాయలు, దుంపలు, తేనె, పొగాకు, మొదలైనవి సంగ్రహించి తమకుఁ గావలసినవి యుపయోగపఱచుకొని మిగిలిన ధనమును సంపాదింతురు.

ఒకానొకసమయమున వీరు వనమునంతయు నఱికి చెట్లనుగొట్టి కంప మొదలైనవానిని గాల్చివేసి భూమినిఁ బదనగునట్లు దున్ని విత్తనములు చల్లి జొన్న, సజ్జ, మొదలగు మెట్టధాన్యమును, దుంపకూరలను బండింతురు. ఇవ్విధంబున వ్యవసాయ మొనర్చుచుఁ దమపైరుల నడవిమృగములనుండి కాపాడుటకై చేలచుట్టును, ముండ్లకంపలతో నలవలు గట్టుదురు. మొక్కజొన్న మొదలగువానిని రక్షించుటకు జేలమధ్యభాగంబున నుంచె నొకదానిని గట్టి దానిపైనఁ గూర్చుండి గింజలనిమిత్తమై వచ్చు పక్షిసముదాయములను నొడిసెలతోఁ గొలుచుందురు.

సవరలలోవలె వీరిలోఁగూడఁ గులభేదములు గలవు. పల్లపుప్రదేశములందుండి వ్యవసాయము చేయువారు గుమ్మ కోయలనియు, నడవులయందుఁగాని, కొండలయందుఁగాని వసించి వేటాడువారు గుట్టకోయలనియు వ్యవహరింపఁబడు దురు. మఱియు వీరిలో వృత్తినిఁబట్టికూడ ననేకభేదములు గలవు. కూలిచేయువారు కాకకోయలనియుఁ, గమ్మరముం జేయువారు కమ్మరకోయలనియుఁ బిలువఁబడుదురు.

వీరు తమకెప్పుడైన రోగములు వచ్చినను, దా ముం డు గ్రామములలో విషూచికాదిరోగములు ప్రబలినను, పశు వులకేమైన వ్యాధులు సంభవించినను, గొండదేవతల వలనఁగాని గ్రామదేవతలవలనఁగాని, కలుగుచున్నవని భావించి యాదేవ తల సంతోషముకొఱ కనేకములగుజాతరలుచేసి మేఁకపోతు లను, దున్నపోతులను,గోళ్ళను, గొఱ్ఱెలను, తృప్తియగునట్లు బలులనిత్తురు. వీరు పండుగదినములందుఁ బచ్చిమాంసమును నిప్పసారాయి మొదలగు మత్తుపదార్థము లనుభవించి మైమ ఱచి నాట్యమాడుచుందురు.

వీరిలో స్త్రీలు ప్రసవించినతరువాత మందులేవియుఁ బుచ్చుకొనక కొన్నికొన్ని చెట్లయాకులు, వేళ్ళు మొదలైనవి కషాయముఁగాచి పుచ్చుకొందురు. వీరిలో రజస్వలానంతర వివాహమే ముఖ్యమైనది. వరుఁడు తనయిష్టమువచ్చిన కన్యను సవరలలోవలె బలాత్కారముగాఁ గొంపోయి పెండ్లియాడును. కన్యాశుల్కము, మంగళసూత్రధారణము మొదలగుక్రియలు యథావిధిగ జరుగుచుండును.

వీరిలో వితంతువివాహములు గలవు. ఈ వితంతువు సామాన్యముగాఁ దనమఱఁదినే పెండ్లియాడవలెను. లేనిచో నామెగాని యామెను బెండ్లాడినవాఁడుగాని కొంతధన మివ్వ వలసివచ్చును. వీరిలో వ్యభిచారములు మెండుగానుండును. ఒకపురుషుఁడు పెక్కుమంది స్త్రీలతో నుండవచ్చునుగాని, యొకస్త్రీ పెక్కురుపురుషులతో సంచరింపఁగూడదు. సంతానములేనిస్త్రీ మరలఁ బెండ్లియాడునట్టియధికారము గలదు. సామాన్యముగా వీరియాచారములు సవరల యాచారములతోఁ దుల్యంబులై కాన్పించుచున్నవి.

వీరు సవరలవలెనే మొలకుమాత్రము వస్త్రముల ధరింతురు. కొందఱు కౌపీనములనుగాని లంగోటాలనుగాని; తాల్తురు. వీరిలో స్త్రీలు మెడకును, చేతులకును విశేషముగా రంగులు గలపూసలను ధరింతురు. నైజాము రాజ్యములోని గుట్టకోయలు కోయభాషనే మాట్లాడుదురు. కోయలు మిగుల నమాయకులు. నీతిగలవారు. వారియందు మంచియభిప్రాయముతోనుండువారి కెన్నడును, గీడు కలిగింపరు. కాని తమ కేదైన నపకారముఁగావించిన యెడల దప్పక వారికి ముప్పుఁ గలిగింతురు. వీ రడవులలో నివసించి చెట్టుక్రియలు బాగుగఁ దెలిసికొని యన్నిరోగములకుఁ దగినచికిత్సలు చేయుదురు. ఆకు పసరులతో భస్మముచేయుట వీరికి బాగుగఁ దెలియును. వీరలకు మందులవాండ్రనునామాంతరము గలదు. వీరు వ్యవసాయవృత్తులందు మిక్కిలినిపుణులు. వీరు వనాంతరములందుఁ గాపురమున్నను సామాన్యముగా బాటసారులకుఁ గీడుసేయరు.

వీరు నమ్మినవారిని నమ్ముదురు. గంగారమ్మ, ముత్తాలమ్మ మొదలగుకొండదేవతల నారాధింతురు. వీరలలోఁగూడ నీకాలమునఁ గొందఱు చదువుకొనుచున్నారు. వీరు చదువుకొనుటకుఁ దగువసతుల నాప్రాంతములలో దొరతనమువార లేర్పఱచుచున్నారు.

---

## 7. కళింగులు-మహాభారతయుద్ధము.

లోకములో సామాన్యముగా భారతకథ నెఱుంగనిమానవుం డుండఁడు. అట్టిమహాభారతములో భీష్మపర్వమునఁ గళింగనాయకుం డగుపౌరవుండు మహాసైన్యసమేతుండై దుర్యోధనునకు సాయంబుగావించెనని చెప్పఁబడియున్నది. ఈకళింగనాయకుండు కోపోద్దీపితమానసుండై, భల్ల, ముద్గర, తోమర, పరశు, భిండివాలాద్యాయుధంబులఁ గైకొని యిరువదివేల హాయంబులతోడను, బదివేలగజంబులతోడను, గేతుమంతుని తోడను, సమరంబునకై బయల్వెడలెను. ఈకళింగనాయకుండుగూడ మహాధ్వజంబులతో, శ్వేతాతపత్రంబులతోఁ జామరాదివస్తునికరంబుతో, నతిమనోహరముగా నుండెను. మత్తగజంబు నధిష్ఠించిన కేతుమంతుండు మేఘంబులనడుమ మధ్యందినమార్తాండుని చందంబున విరాజిల్లుచుండెను.

అప్పుడు సుయోధనుండు కళింగనాయకునిఁ దనసైన్యముతో జవంబునఁబోయి భారద్వాజనందనుని సంరక్షింపఁ బం

వెను. అట్టిసమయమునఁ గళింగసైన్యములు భీమసేనునితోఁ బోరాటమునకుం గడంగ వారికిని భీమునకును జరిగినయుద్ధము మహాభయంకరమై యసమానమై కాన్పించెను. ఇరుపక్షముల వారును విజయోత్సాహులై శౌర్యధైర్యగాంభీర్యము లుప్పతిల్లఁ బోరాడఁజొచ్చిరి. మొదట నిట్టినిర్వక్రపరాక్రమంబున రణంబొనర్చుకళింగసైన్యము నిషధరాజసూనుం డగుకేతుమంతునియాధిపత్యముక్రింద భీముని ముట్టడింపఁబోయెను. ఆ యుద్ధము దేవదానవయుద్ధముంబోలి భీతిగొల్పుచుండెను. యుద్ధరంగమునుండి బయల్వెడలినకోలాహలము మహాప్రళయంబున మేఘధ్వని ననుసరించియుండెను. కళింగనిషధులకును జేదీయులకును జరిగిన సంగ్రామ మనిర్వాచ్యమై, చూడ నలవిగానియంతక్రూరత్వము గలదియై యుండెను.

అట్టితరుణమునఁ గళింగులదాడికిఁ దాళలేక మహాభీతచేతస్కులై బలంబులేక చేదీయులు వెనుదీసిరి. అంతట భీముఁ డొక్కఁడే వారితోఁ బోరాడి మిగుల శరవర్షంబు గురిపింప నావిషయంబులఁజూచి కళింగనాయకుండు తనపుత్రుఁ డగుశక్రదేవునితోఁగూడ రణభూమిం జొచ్చి భీముని రథంబునకుఁ గట్టియున్నహయంబులఁ ద్రుంచి యాతనిపై నంతకంటె మిగుల బాణవర్షంబుఁ గురిపించె. ఇట్టిబెట్టిదపుసమయమున భీమసేనుండు తోకఁద్రొక్కిన త్రాచుచందమున లేచి మండిపడుచుఁ దనచేతనున్నగదాదండంబును విసరి కళింగనాయకునిపుత్రుం డగుశక్రదేవుని సంహరించె.

అంతటఁ గుమారుఁడు పోయె ననుకోపంబున గ్రీష్మ కాలంబున మధ్యాహ్నసమయమున మార్తాండునివోలె మండి పడుచు మరల భీమసేనునిపై నుఱక భీముండు వానిని గరవాలంబునఁ దెగటార్చెంబూనె. అట్టితఱిఁ గళింగనాథుం డెట్లో తనను రక్షించుకొని భీమునిపై నిపలి ప్త బాణంబులం బ్రయోగించెను. ఆబాణంబుల భీముఁడు తనకరవాలంబున ముక్కలు సేయ భానుమంతుండు బాణవర్షము గురిపింపసాగె. ఇట్టిబాణ వర్షంబునకు జంకక పవనాత్మజుండు కళింగసైన్యము బెగ్గడిల సింహనాదముసేయుచు భానుమంతునిపై కుఱికి వానిందెగ టార్చి కరవాలంబుఁ జేఁబూని కళింగసైన్యమధ్యభాగంబున కుఱికి వారిచతురంగబలమునంతయు సమయింపఁజేసెను.

ఇవ్విధంబునఁ గళింగు లెంతటిశౌర్యాటోపంబునఁ బోరఁ గడంగినను భీముండే జయించుటవలన శ్రుతాయువు మిగుల ధైర్యమవలంబించి పదునాలుగుతోమరములు ప్రయోగించి భీమునిఁ గలతఁబడఁజేయఁగా భీముండు తనచాపంబుచే శ్రుతాయువుమొదలగువారినిఁ దెగటార్చి కళింగ సైన్యములఁ బాఱందోలెను. ఇట్లు భీముండు యుద్ధరంగమునఁ గ్రోల్పులి వలె సంచరించుచున్నను ధృష్టద్యుమ్నునిసహాయముతో వారిగో ననేకులఁజంపి యుద్ధభూమిర క్తప్రవాహములతోఁ బాఱునట్లు కావించెను. ఇట్టిమహాభయంకర మగుయుద్ధ మేనాడును జూచియుండ లేదు. కళింగనాథుఁడు సైన్యంబుతోఁగూడ వచ్చి నీచే నోడిపోయె. భానుమంతుఁడు శ్రుతాయువు మొదలగువారు నీచేఁ జంపఁబడిరి. వేలకువేలు రథములు, గుఱ్ఱ

ములు, గజములు, నీచే నిర్మూలింపఁబడినవి. వారిసైన్యమంతయుఁ ద్వాదశదండమున కెఱియయ్యె. ఇట్టిపరాక్రమసంపన్నుఁడవై వైరులపాలిటియముండవై సంచరించునీ కీభూలోకంబున సమాను లెవ్వరని సాత్యకిమొదలైనవారు భీముని శ్లాఘించిరి.

భారతమునఁ గళింగుఁడు దీర్ఘతమస్సునకుం బుట్టి కళింగులకు నాయకుండగుటచే నతఁడు యుధిష్ఠిరునిసమకాలికుఁడనియు, ద్రౌపదీస్వయంవరసందర్భమున నీతం డుండినట్లును, పిదపఁ గేతుమంతునితోఁ గూడి, దుర్యోధనునకు సహాయముగాఁ గలసివచ్చినట్లును జెప్పఁబడినది. ధర్మరాజు తీర్థయాత్రల నాచరించునపుడు కళింగదేశమున కేతెంచి నట్లును, కళింగులుకూడ నిఖలజాతులతో సమానముగఁ గప్పంబు గట్టినట్లును, బ్రమాణములు కాన్పించుచున్నవి.

ఇవ్విధంబున నోటమిఁ గాంచినప్పటికిని నిఖలకళింగ ప్రముఖులును దుర్యోధనుని వెంట నంటి యభిమన్యు నోడించిరిగని తుదకు వాసుదేవునిచే నిహతులైరి. కావున బలపరాక్రమసమేతులై యుద్ధరంగమునఁ దమపరాక్రమమును బ్రదర్శించి యిట్లనేకవిధముల దుర్యోధనునకు సాయంబొనరించి కౌరవులతో సంబంధముగలిగి యార్యావర్తనమున నున్నయీ కళింగులు ప్రాచ్యదేశంబునకుఁ బోయినందున మతివిహీనులుగా భావింపఁబడియుందురని కొందఱయభిప్రాయము.

ఇది యిట్లుండనిండు. ఇటీవల క్రీ. పూ. 6 శతాబ్దములో దండకుఁ డనునొకరాజు కళింగదేశములోని కుంభవతీ

పురము నేలినట్లును, బిమ్మటఁ గొంత కాలమున కితఁడు దుర్మార్గుఁడై యొక మహర్షి నవమానింప నాతని శాపమునఁ దుదకు రాళ్లవాన గురిసి తానును, దనప్రజలును మృతిం జెందిరి. ఇట్లే మఱియొక కళింగ రాజగు నలికేరుఁడనువాఁ డనేకులగు బ్రాహ్మణయోగులను వధించి రాజ్యభ్రష్టుఁడై తుదకుఁ దానును నశించెనని దండక జాతకములోని కథనుబట్టి తెలియచున్నది. కావునఁ గళింగమునకు దండకుఁడే ప్రభువనియుఁ, గళింగార్థక భీమరథు లితని సామంతులనియు, దండకుఁడు పోయినపిదంపడి వీరు బౌద్ధమత మవలంబించి యన్యాయమార్గము విడనాడి సన్మార్గప్రవర్తకులై కళింగదేశముఁ బాలింపసాగిరని చరిత్రల వలనఁ దెలియుచున్నది.

వీరు తమకు ముందుపోయిన రాజుల ప్రవర్తనముల ననుసరించి తామట్లు సంచరించినఁ దమ కేమిమూడునో యను తలంపుచేఁ బరులకుఁ గీడుదలఁపక చేతనైనవఱకు నుపకారములాచరించుచుఁ బ్రజలమన్ననలకుఁ బాత్రులైరి. మఱియు వీరు బౌద్ధమతస్థులు కావున వీరివలననే కళింగదేశములో బౌద్ధమతము వ్యాప్తిఁజెందియుండుననని తెలియవచ్చుచున్నది.

ఇవ్విధంబునఁ గళింగరాజులు బర్మా, సుమిత్రా, మొదలగుప్రదేశముల కేగి యచ్చట రాజ్యముల నేర్పఱచుకొని బౌద్ధమతము నాయాప్రదేశములందు వ్యాపింపఁజేసిరి. ఆ కాలమునఁ బ్రజలు సముద్రయానముల నతిసులభముగా నొనర్చుచు నాయాద్వీపములతో వాణిజ్యము మొదలగునవి జరుపుచుండిరి. మఱియు నయ్యెడలఁ గళింగదేశమువలె మిగిలిననవభువన

పాండ్య, నాగద్వీపములు మొదలగునవి వాణిజ్యమునందు మిక్కిలిఁ బ్రసిద్ధిగాంచెడివి. అప్పుడు దంతపురము, కుంభవతి మొదలగుకళింగపట్టణములు మిగుల ననమానవైభవముతోఁ దులదూగుచు నవరదేవేంద్రపట్టణములభంగి విరాజిల్లుచుండె డివి.

అట్టిమైశ్వర్యముల కాటపట్టగుకళింగదేశమునుండి యి తరదేశములకు గంధము, ముత్యములు, రత్నములు, మణులు, సువర్ణాదిలోహములు,ప్రత్తి, వస్త్రములు, ధాన్యములు మొద లగునవి యెగుమతియగుచుండెడివి. అప్పటికాలమున సము ద్రయానమున రేవులు, పట్టణములు, తెలిసికొనుటకు, దిక్కు తెలుసుకొనుటకు నిప్పటివలెఁ దగుయంత్రములు లేనందున నావి కులు తారకామండలసాహాయ్యమున వాని నెఱుంగుచుండెడి వారు. ఇట్టివ్యాపారములచే నిండుకొనియుండునగరముల వైభ వము లింతింతయని చెప్పనలవిగాకుండెడివి. అప్పు డేయేమత ములవా రాయామతాచారములం జక్కఁగ నవలఁబించియుం డిరి. ఆకాలమున సమస్తవిద్యలు ప్రచారములో నుండెడివి.

పాఠశాలలలో సంగీతము, నాట్యము, చిత్రకళ, మొద లైనవి నేర్పఁబడుచుండెడివి. సామాన్యముగా నప్పటికి నాం ధ్రకళింగపైశాచీభాషలు వాడుకలో నుండఁజొచ్చెను. ప్రజలు వేద, జైన, బౌద్ధమతము లవలంబింపసాగిరి. రాజ్యములో నే విధములైనయధర్మములు ప్రబలకుండఁ బూర్వపురోహితధర్మం బు లవలంబించి రాజులు రాజ్యములు చేయుచుండెడివారు. ఎచ్చటఁజూచినను ధర్మహీనత గాన్పింపకుండెడిది. ప్రజలు

రాజశాసన మవలంబించి తమతమ వర్ణాశ్రమాచారములఁ జక్కఁగ నెరవేర్చుకొనుచుఁ బ్రిపత్తివరులై భగవద్ధ్యాన మొనరించుచు సత్యవాక్ప్రియులై సంచరింతురుగాని మఱి యొకదుష్ప్రవర్తనకు లోనుగాకుండిరి. రాజులును గంటికి ఱెప్పఁబోలెఁ బ్రజలఁ దమబిడ్డలమాదిరిఁ గాపాడుచుండెడి వారు.

కావున నిట్టిపద్ధతులతోఁ గళింగదేశము మొదటినుండి వన్నె కెక్కెనది. కళింగదేశప్రాచీనమతచరిత్రమునుబట్టి విచారింప భువనేశ్వరమునకుఁ బశ్చిమభాగమునఁ గలఖండగిరియందు గుహలు గుహాలయములు జైనమతస్థులకొఱకు నేర్పఱుపఁబడి వారిచేఁ జాలకాలము పయోగింపఁబడినట్లుశాసనములవలనవిశద మగుచున్నది. ఇప్పటికి నీఖండాద్రియందలిజైనాలయములకు జైనులు సంవత్సరమున కొకసారి యాత్రార్థమై యరుగుచుందురు. ఈగుహాయందు వినాయకుఁడు, లక్ష్మి, సూర్యుఁడు, మొదలగువిగ్రహములు విశేషముగఁ గలవు. ఈవిగ్రహములు చూడంజూడ 8 లేక 11 శతాబ్దములమధ్యయందు నిర్మింపఁబడినవని కొందఱు చెప్పుదురు. చోడగంగునిమనుమఁ డగుమదనమహాదేవచక్రవర్తి హిందువులచేఁ బ్రోత్సహింపఁ బడి యీగుహాలయములందలిజైనుల హింసించి పాఱఁదోలి నాఁడని చరిత్రవలన విశదమగుచున్నది. ఇట్టిగుహ లింక ననేకములు గలవు. వానియందు జైనవిగ్రహము లతిరమ్యంబులై కానవచ్చుచున్నవి.

తొల్లి మొట్టమొదట జైనమత ముదయగిరిశిఖరము లందుఁ బుట్టి క్రమముగా క్రీ. పూ. 4 వశతాబ్దమునుండి యుఁ గళింగదేశమం దంతటను వ్యాపించినది. దీనికి నాయాగుహాలయములందుఁ జైనమతచిహ్నములు, జైనవిగ్రహములు కాన్పించుటయే ప్రబలప్రమాణము. మఱియు నాంధ్రసామ్రాజ్యస్థాపనము ప్రారంభింపవచ్చునప్పటికే కళింగదేశము చేదివంశీయులయాధిపత్యము క్రిందనుండి మిగుల నాగరకత గాంచెనని పూర్వశాసనములవలనఁ దెలియుచున్నది. ఐనను దత్కాలంబున వన్నెకెక్కినశిల్పవిద్య తత్కాలంబునంగల రాజ్యముచందంబున స్వాతంత్ర్యముగలదని నొక్కివక్కాణింపవచ్చును. ఈ జైనవిగ్రహములేగాక తత్తద్గిరిగుహాలయందు సూర్యాదివిగ్రహములు కాన్పించుచుండుటవలన నచ్చటఁ జాలకాలము హిందువులుగూడ నివసించియున్నట్లు తెలియవచ్చుచున్నది. ఖండగిరిగుహాలలోఁ బ్రాచీనము లైనశిల్పము లతిప్రసిద్ధములును, సుందరములునై చూచువారల డెందంబులకు మిగుల నానందమును గల్గించుచున్నవి. కావున బాగుగఁ బూర్వచరిత్రలను విచారించిచూడ నీకొండలు మొదట జైనులచే నాక్రమింపఁబడి పిమ్మట బౌద్ధులస్వాధీనములోనికి షుమారు క్రీ. పూ. 3 లేక 4 శతాబ్దములందు వచ్చెనని తోఁచుచున్నది.

ఇవ్విధంబునఁ గళింగదేశమున మొదట నిట్టిమతములు వ్యాపించినవి. కళింగు లతిపరాక్రమవంతులనియు, భారతయుద్ధమున దుర్యోధనునకు సాయమొనరించిరనియు, నింతకు

మునుముం జెప్పఁబడినది. ఈకళింగదేశమున మొదట జైన, బౌద్ధమతములు వ్యాపించి వృద్ధిఁబొందినట్లు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. ఈవిషయ మిట్లుండనిండు. క్రీస్తుశకము 5వ శతాబ్దము నాటికిఁ బురాతనతమిళగ్రంథముల ననుసరించి యుఁ బురాణములఁ బట్టియు, నాంధ్రులు కాణ్వాయనుల తరువాత మగధదేశము నేలిరనియు, నత్తఱిఁ గళింగదేశము కూడ వారిస్వాధీనమం దుండెననియు, నాంధ్రకళింగజాతులు రెండును, భిన్నభిన్నములుగా, భాగీరథీగౌతమీనదులమధ్య భాగమునం దంతటనునివసించియుండెననియుఁ దెలియుచున్నది.

ఆంధ్రులు కళింగదేశమునుగూడఁ గొంతకాలము పరి పాలించిరనుటకు నాంధ్రరాజులనాణెములు, శాసనములు, కళింగదేశమున లభించుటయే ప్రబలాధారమని చెప్పఁదగి యున్నది. ఇదియును గాక కళింగదేశమున నంధవరము, అం ధవిల్లి, మొదలుగాఁగలగ్రామములు వారిరాజ్యస్థాపనమును సూచించునవియే యని యెల్లరకుఁ దెలిసినవిషయమే గదా ? కావున నీయాధారముల ననుసరించి మగధకళింగదేశములఁ గొంతకాల మాంధ్రులేలిరనుటలో సందియ ముండదని చరిత్ర కారుల యభిప్రాయము. ఇట్టి కళింగదేశము సముద్రమునందు రత్న, సువర్ణ, మౌక్తికాది వ్యాపారములచే నసమానవైభవ ములతోఁ దులదూఁగుచుండుటవలనఁ గొంతకాలమునకు సము ద్రగుప్తుఁ డనురాజేంద్రుఁడు కళింగదేశమును జయించినను తద్దేశమున రాజ్యవిధానముల కెట్టిమార్పును గలిగింపలేదని యు, పుణ్యాభివృద్ధిఁ గావించి స్వర్గముఁజేరుటకై దేవతాప్రీతి

కరంబులగు యాగంబు లనేకంబు లొనర్చెననియు, నాతని శాసనమువలననే తెలియుచున్నది. కాఁబట్టి మొట్టమొదటినుండి యీ కళింగదేశము సమస్తదేశములలో వన్నెకెక్కి యపర స్వర్గంబన విరాజిల్లుచుండెననియు, నాదేశమును బాలించుచుఁ గౌరవులకు సాయంబొనర్చిన కళింగరాజులు ధర్మతత్పరులై న్యాయమార్గం బవలంబించి సత్యవాక్పటిమ నొప్పారుచుఁ బ్రజలనెల్లఁ దమకన్నబిడ్డలవలెఁ జూచుచు వర్ణాశ్రమాచారంబులఁ దప్పక నెరవేర్చుచుఁ దమకీర్తిచంద్రికల దిక్కులవ్యాపింపఁజేసి రాజ్యంబునేలిరి. అట్టివారిచరితంబు లాచంద్రార్కము సుస్థిరంబులై యుండునని చెప్పఁదగియున్నది.

---

## 8. సవరలు

ఇదివఱలో సవరజాతిని గుఱించి చర్చించితిమి. అచ్చటఁ గోయలకు, సవరలకుఁ గలయాచారవ్యవహారాదుల ననుసరించి కొన్నికొన్ని మార్పులు సూచింపఁబడినవి. ఇచ్చటఁ గేవలము సవరజాతినిగుఱించి విశేషముగా విచారింతము. ఈసవరలు సామాన్యముగా గంజాం, విశాఖపట్టణము, మొదలగుజిల్లాలలో నెక్కువగాఁ గాన్పించుచున్నారని యిదివఱకు వ్రాసినదానివలన మీకుఁదెలిసియేయున్నది. కాని యిది పాఠకులకుఁ గ్రొత్తకాదు. దేశచరిత్రములందుఁగూడ నీ సవరజాతి ప్రాచీనకాలమునుండి యున్నట్లు తెలియవచ్చుచున్నది. ఐతరేయబ్రాహ్మణములోఁగూడ నాంధ్రపుండ్రశబరపుళిందాదు

లను పేర్కొన్నందువలనను, భారతమున శాంతిపర్వములో యవనకిరాత గాంధారచీన శబరబర్బరాదులని చెప్పఁబడినందునను, శ్రీమద్రామాయణములో శబరి శ్రీరామచంద్రమూర్తికి ఫలాహారంబుల నొసంగినట్లును, స్కాందపురాణములోని ముఖలింగక్షేత్రమాహాత్మ్యమున శబరులకు సంబంధించిన గాధ పేర్కొన్నందువలనను, నీ సవరజాతి యనాదినుండియు నుండెనని చెప్పుటలో సందియ మేమాత్రమును లేదు.

ఇదియునుంగాక మఱియొకవృత్తాంతముగలదు. పూర్వము రాజేంద్రులలో నుత్తముండై ప్రజలఁ దాఁగన్నబిడ్డలచందంబునఁజూచుచు ధర్మమార్గానుగామియై వర్తించు మృగాంకదత్తుఁడను నొకపార్థివోత్తముండు గలఁడు. ఆతఁడు మహాబలిష్ఠుఁడు; ఆతని కాలమునఁ బ్రజలందఱును, పరిశుద్ధులు, నిర్మలాత్ములునై వర్ణాశ్రమాచారంబులఁ జక్కగ నెరవేర్చుచుండిరి. ఇట్టిధర్మాత్ముండగు నీతనిపరిపాలనకాలమున జనులు సుఖముగా జీవించుచుండిరి. ఈతఁ డిట్టివిధంబున సర్వజనానురంజకుండై నిఖిలాయుధపరిశ్రమములందు నేర్పరియై నిశ్చాత్రివముగ రాజ్యపరిపాలనం బొనరించుచు నొకానొకదినంబున నర్మదానదికి స్నానార్థమై యరిగి జలంబుల దిగె. అంతకుఁ బూర్వ మటస్నానమాచరించుచున్న మాయావటుఁడను శబరభూపతి నొక్కనక్రంబు పట్టుకొని యీడ్చుచున్నట్లు గాన్పించె. ఆరాజేంద్రుఁ డాపత్త్రాలబాంధవుండగు శ్రీమన్నారాయణుండో యన వెంటనే యట కరుదెంచి యానక్రంబును ద్రుంచి యాశబరనాయకుని రక్షింప నాశబరనాథుం డారాజచంద్రునకుఁ

దనవినయంబును బ్రదర్శింపఁజేసి సాష్టాంగదండప్రణామం బాచరించి స్వామీ! తామెవ్వరో నే నెఱుంగ; నాకుఁ బ్రాణ దాన మొసంగితి రనుచు శ్లాఘించి యాతనితో సఖ్యంబుఁ జేసికొని యామృగాంకదత్తుని దనపురంబునకుఁ దోడ్కొని పోయె.

ఈ కారణమువలన నీమృగాంకదత్తుఁ డాశబరదేశములోఁ గొన్నిదినంబులు వసించుట సంభవించెను. కాఁబట్టి యిట్టిగాథ లనేకములు గలవు. ఈగాథలందు వాడఁబడినశబరశబ్ద మీ సవరజాతినే సూచించునుగాని మఱియొకజాతిని సూచింపదు. భారతములోనే పెక్కుచోట్ల శబరజాతికి సంబంధించినవిషయ ములు పేర్కొనఁబడినవి.

ఇదియునుంగాక వేదకాలమునాఁటియార్యులయాచారా దులకును, ప్రాచీనకాలమందలిశబరులయాచారాదులకును గొన్ని కొన్ని తావుల సాదృశ్యధర్మములు గాన్పించుచున్నవి. నరబలు లీశబరజాతిలోనే కాక యార్యజాతులలోఁగూడనుం డెడివనుటకుఁ బ్రమాణములు గలవు. పూర్వ మొకపార్థివేం ద్రుండు యజ్ఞమొనరించుచు యజ్ఞపశువు నష్టమైపోయినందునఁ బశువునిమిత్తమై వెదకుచు రుచికుఁ డనుమునిసమీపమున కరిగి యతనిద్వితీయపుత్త్రుం డగుశునశ్శేఫుని యజ్ఞపశువుగాఁ గొని తెచ్చినట్లును, పిమ్మట నాతఁడు విశ్వామిత్రునికడ కేగి రక్షింపుమని ప్రార్థింపఁగా విశ్వామిత్త్రుఁ డేవో రెండుకథలు వానికిఁ జెప్పినట్లును, తత్కథలతో శునశ్శేఫుఁడు దేవేంద్రుని స్తుతింపఁగా నింద్రుఁడు వచ్చి యజ్ఞము పరిసమాప్తియగునట్లు

వరంబిచ్చి శునశ్శేఫునిఁ గాపాడిన ట్లొకపురాణగాధ కాన్పించు చున్నది.

కావున నిట్టిగాధలవలన నరబలి పూర్వ మార్యులలోఁ గూడ నుండినదనుట కెట్టిసందియము లేకపోవుటయే కాక యిట్టియాచారములకట్ల ననార్యులగు నీసవరలయాచారము కూడ సామ్యంబునొందుచున్నది. మఱియు సవరలు తొలిగు బోతులుగా నుండి హింసాకర్మము లాచరింతురని చెప్పుదురు. ఇదియునుంగాక యీసవరలు కొన్నికొన్ని శాసనములం బట్టి చూడ రాజ్యము లేలిరన్నట్లు తెలియుచున్నది. ఒకానొకశాసనమున నందివర్మ యనునొకపల్లవరాజు పరాక్రమవంతుఁ డగు నుదయనుఁ డనుశబరనాథు నోడించిన ట్లుండుటచేతను, మఱి యొకచోటఁ గళింగదేశమందలి గంగవంశీయులకు మూలపురుషుం డగుకామార్ణవుఁడు శబరాదిత్యు నోడించినాఁడని యుండుటచేతను, సకలవైభవోపేత మగు నీకళింగదేశమందుఁ దమ కంటె నతిబలిష్ఠులగు శత్రువులదాడి కాగలేక కొండలలో నివాసమేర్పఱచుకొన్న ట్లూహింపవచ్చును. ఇవ్విధంబున వచ్చుటచ్చుట శబరశబ్దమును వాడుటచే నీశబరశబ్దము సవరశబ్ద పర్యాయవాచకంబని తేలుచున్నది. వీరు సామాన్యముగా నెచ్చటనున్నను స్వాతంత్ర్యమును గాపాడుకొని స్వేచ్ఛావృత్తులతో జీవించుచువచ్చిరనుటకుఁ బ్రమాణము లనేకములు గలవు.

పూర్వకాలమున నీసవరలయేర్పాటుల ననుసరించి యెవ్వఁడైన మిగుల నేరము లొనరించినప్పుడును, బహుప్రాణు

లకు హానికలిగించినప్పుడును, మందిరములు గాల్చినప్పుడును ధనంబునకు నష్టంబుగలిగించినప్పుడును దప్ప మఱిదేనికైనను మరణశిక్ష విధించుటలేదు. మఱియు సంతానాభివృద్ధి యాఁడు దానివలననే వృద్ధిఁబొందునదగుటచే మగవానికంటె నాఁడు దానినిఁ జంపినఁ బాపము మెండని వీరలయభిప్రాయము. దొంగతనముచేయుచుండఁగా దొంగ చిక్కినయెడల వానిని జంపినను దోషముండదని వీరల తాత్పర్యము. సామాన్యముగా వీరిమతములో వ్యభిచారదోషము పురుషునేగాని స్త్రీని బాధించదు. ఎవనివలననైనను నష్టపరిహారముక్రింద వసూలుచేయఁబడినధనము దేవతాశాంతికై సమారాధనలు చేయవలయునని పెద్దలచేఁ దీర్మానింపఁబడును.

వీరి మతాచారాదులఁ జక్కఁగ నిర్ణయించుట బహు కష్టతరము. తమగ్రామములోని ప్రజలకుఁగాని, పశువులకుఁగాని, రోగములు సంభవించినయెడల నారోగములు గ్రామదేవతలకోపంబునఁ గల్గినవని భావించి మతములోఁ బెద్దయగువాఁ డెట్లుతీర్మానించునో యందఱు నట్లే యాచరింతురు. కావున నట్టికష్టకాలమున దేవతాప్రీతికొఱకు జంతువులను బలి యిచ్చుట వారిధర్మము. వీరు మెరకపంటలు గాకుండఁ బల్లపుభూములనుగూడఁ బండించి తమజీవనోపాధికిఁ జాలినంత ధాన్యముదాచుకొని మిగిలినధాన్యంబు విక్రయించి ధనము మిక్కుటముగా నార్జింతురు. ఈసవరజాతిలోఁ బురుషులుకూడ మెడలోఁ గంటెలు, పూసలుమొదలగునాభరణములధరింతురు. వీరిలో సంగీతముపాడువారుకూడఁగలరు. వీ రొకానొకసమయ

మునఁ బిట్టల వేటాడి యామాంసమును వండకయె భుజింతురు. మఱియు నీజాతివారు పాములను భుజించుటకూడఁ గలదు. ఈజాతిలో బాల్యవివాహములే తఱచుగా జరుగుచుండును; గాని రజస్వలానంతరవివాహములు లేకపోలేదు. వీరి సుతాచారప్రకారము వరుఁడుగాని వారికి సంబంధించినవారుగాని కన్యకనిమ్మనియడుగవలయునే కాని యాడుపిల్లవైపువారు వచ్చి మాపిల్లను మీపిల్లవానికిఁ జేసికోవలసినదని వరునివైపువారిని నడుగఁగూడదు. ఈజాతిలోఁ బురుషుఁ డెంతమందినైన వివాహమాడవచ్చునుగాని స్త్రీ యొక్క నికంటెఁ బైన వివాహమాడఁగూడదు. వితంతువులకుఁగాని భర్తవిడిచిపెట్టినస్త్రీకిఁగాని పునర్వివాహములుగూడఁ గలవు. వీరిలో సమస్తశాఖలవారుండిరని వాడుక కలదు. ఒకశాఖవారు పశుమాంసభక్షణము చేయుదురు. అది లేనివారు వారిపిల్లను జేసికొందురుగాని తమపిల్లను వారి కీయరు. వితంతువులలో వివాహము గోరుకన్యక తమమఱఁదులలో నేరినైనఁ జేసికొనవలయునుగాని బావలనుమాత్రము చేపట్టరాదు. ఆమెకు మఱఁదులలో నేరినైనఁ జేసికొనుట కిష్టములేనియెడ నామెయత్తవారింటిసొమ్మదియుఁ దీసికొనిపోకుండఁ దాను వరించినవానిని జేసికొనవచ్చును. కాని యిందులో నొకవింత గలదు. ఇట్లన్యునిఁ జేసికొనఁబోవునపుడు మొదటిమగనిభూతమున కేదియైనను బలి యివ్వవలెను. అట్టికార్యము బోయయనువాఁడు నెరవేర్చవలసియుండును. అతఁడు మొదట నాచనిపోయినమగనిభూతమును బిలిచి 'యీ పందిమాంసమును, కల్లును నీకు బలిగా

నిచ్చుచున్నాను. కావున వీనిని భుజించి యీమెనుగాని యీ మెకుఁ బుట్టఁబోవుసంతానమునుగాని యెచ్చటనైనను బాధింపవలదు. సీతమ్మలకుఁగాని నీకుఁగాని సంబాధించినవస్తువు లేవియు నీమె తీసికొనిపోవుటలేదు. కావున నీవిట్టిచెడుకార్యము నకుఁ గడంగకుము. ఈమెను వివాహమాడఁబోవువాఁడు నీ కేమియు నపకారమొనర్ప లేదు. అతని నామె వరించినది. వారి ద్వారకు నేవిధములైన యాటంకములు కలిగింపవల'దని నొక్కి వక్కాణించి 'యీ పదార్థములతో నీవుఁ దృప్తిపొంది పోవలసినది; ఇందులకుఁ బితృదేవతలు సాక్షు'లని వచించును.

ఈసవరలలో వివాహసందర్భము లీపైనఁ జెప్పిన విధంబున జరుగుచుండును. వీ రెల్లప్పుడు సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమానపర్యంతము పిల్లలుమొదలు కొని పెద్దలవఱకుఁ గష్టించిపనిచేయుచుందురు గాని సోమరిపోతులవలె నూరకుండరు. మొద్దులవలెఁ బనిచేసినను బుద్ధికుశలత లేనివారు. ధనముగాని ధాన్యముగాని కష్టకాలములలోఁ బనికివచ్చునను భావమున నిల్వఁజేసికొన లేని మాంద్యులు. వీరిలో నొకగుణము చాలమంచిగుణము. సామాన్యముగా మనవారిలో జరుగుబాటు తక్కువగా నున్నవా రేదియో యొకనెపము పెట్టి లోకులబాకీ లెగవేయుదురు. వీరుమాత్రము అట్లుగాక తమ కెన్నికష్టములు వచ్చినను, కూటికి లేకపోయినను లోకులబాకీలుమాటుకుఁ దీర్తురుగాని యెగవేయరు.

వీరు వనములలో నివసించి కట్టెలు కొట్టి యమ్మిగాని యరణ్యమును జదనుజేసి యాభూములను బండించికాని జీవనముఁజేయుదురు. కొండకాలువలు తమభూముల కేయాటంకమును జేయకుండఁ గట్టలుగట్టుకొని యానీరు పైరుల కెట్లుపయోగించునో యట్టియేర్పాట్లు గావించుకొందురు. అట్టిపనులలో సవరలకుఁ గలచాతుర్యము మెండు. వీరు కట్టెలుగాని బొంగులుగాని కొట్టి మోపులుగట్టుకొని వానినిఁ దమబుజములమీఁదఁ బెట్టుకొని కొండలమీఁద నెంతప్రమాదకరములైన మార్గములనైనను గడువేగమున దాటిపోవుదురు. వీరు మృగములనుగాని, పక్షులనుగాని, పట్టుకొనుటలోఁ గడు నేర్పరులు. అప్పుడప్పుడు వనాంతరములలోనికి వేటకేగి మృగములనుగాని పక్షులనుగాని చంపి తీసికొనివచ్చి వానిమాంసములఁ దిందురు. మఱియు వీరికిఁ బాములుకూడ నాహారమే. ఎంతపెద్దపాములనైనను సులభముగాఁ బట్టి తల నఱికి వండుకొని తిందురు. సాధారణముగా వీ రరణ్యములలో నివసించి యిప్పకల్లు విశేషముగాఁ ద్రాగుదురు. వీరు వ్యవసాయముఁజేసి జీవించువారు కావున వీరికి, నాగలి, పార, వలుగు, కత్తి, గొడ్డలి, మొదలగునవి ముఖ్యసాధనములు.

ఈ సవరలకు ముఖ్యముగా రెండుమూడువందలకు పైగా నోషధులు తెలియును. వీ రెంతపెద్దగాయమునైన నాకు పసరులతోఁ గట్టుకట్టి మాన్పుదురు. కాని వ్యాధులు సంభవించినపుడు మందులు పుచ్చుకొనుచున్నను దేవతాపూజ లాచరించి జంతువులను బలియిచ్చినఁగాని వ్యాధులు నెమ్మదించ

వనుపెద్దనమ్మ్రాక మొకటి వీరికిఁ గలదు. అప్పుడప్పుడు నలుగురు ముగ్గురు గలసి నాట్యములొనరించుచు మైమఱచినట్లు పాటలు పాడుచుందురు.

మనజాతిలోఁ గూలివాండ్రు పైరునాటుసమయమునఁ గాని కోతసమయమునఁగాని పాటలుపాడుచు నాపనుల నెట్లు చేయుచుందురో యట్లే సవరలలోఁగూడ నలుగురుముగ్గురు కలిసి పాటలు పాడుకొనుచు నరణ్యములలోఁ గఱ్ఱలుకొట్టుట గాని చేలలోఁ బైరులుమొదలగునవి కోయుపనులుగాని చేయుచుందురు. ధాన్యముమొదలైనవి దంపునప్పుడుకూడ నారోకళ్ళసందడికిఁ దగినలయ గలపాటలు పాడుచుందురు. మనవలె వారుకూడ మిగులనందములగువస్తువులను జూచి పట్టరాని సంతోషమున నుప్పొంగుచుందురు. వారలభావము లెటువంటివైనవి వారు పాడుపాటలలోనే వ్యక్తములగుచుండును. నాగరకత తక్కువైనను వారిభావముల సహజముగా వ్యక్తపఱచుచున్నందున వారిపాట లాలించునపు డొకవిధమైన యానందము మనంబునఁ గల్గును. దేవతాపూజలు మొదలగునవి వచ్చునపుడు వారు పాడుపాటలలో నాదేవతాచరిత్రములు వెల్లడియగుచుండును. తగినవిధంబునఁ బూజలొనరించి యిట్లు పాడినఁ గాని తమకోరికల దేవతలు నెఱవేర్ప రనుగొప్పవిశ్వాసము గలదు. వారు పాడుపాటలలో శృంగారము, హాస్యము, పదములపొందికలు, విశేషముగాఁగాన్పించుచుండును. దేవతోత్సవములకట్లు నందఱుఁ గలసి పాడుచు భల్లూకములు, వానరములు నాడునాటలవంటియాట లాడుదురు.

వీరిలోఁ దండ్రి జీవించియున్నంతవఱకుఁ బుత్రు లెంత పెద్దవారైనను భాగములు విడిపోవు; కుమారులు వేఱుగా నున్నను భోజనముమాత్రము తండ్రిగారి యింటిలోనే చేయు చుండవలయును. తండ్రి చనిపోయినతరువాతఁ బెద్దవాఁడు మైనరులుగా నుండిన తనతమ్ములకు రక్షకుఁడుగానున్నను దుదకు భాగములు పంచుకొనవలసినప్పుడుమాత్రము సమానముగాఁ బంచుకొందురు. వారిలో దత్తతలేదు. వీరిలో జ్ఞాతు లుండిన యెడల మగనియాస్తి భార్యకు సంక్రమింపఁగలయాచారము లేదు. మగఁడు పోయినతరువాత స్త్రీ మరల వివాహమాడకుండినయెడల మగనియాస్తి నెవ్వ రనుభవింతురో వా రీమెను బోషించితీరవలయు ననుకట్టుబాటు గలదు. వీరిజాతిలోఁ గలహము లేమైన సంభవించినయెడల జాతిలోఁ బెద్దయగునాతఁడు వచ్చి యాకలహములను దీర్చుచుండును. వీ రెల్లప్పు డమాయకులుగా నుండి యితరులకుఁ దా మివ్వవలసినయప్పులు తీర్చుకొనుసమర్థతలు లేక తమభూములను, దమయిండ్లను వారికిచ్చి తాము మిక్కిలికష్టములు పడవలసినవారుగా నుందురు. వీరు వనాంతరములం దుండినను మార్గస్థుల నేమియుఁ జేయరు. మార్గస్థులలోనే దుర్మార్గు లుండి తమ కేమైనఁ జెఱుపుఁ జేయఁగడంగినతఱిఁ దాము వెంటనే వారలకు హానిఁగావింతురు. కాని యంతదనుక వీ రేమియుం జేయరు.

వీరికి వేటాడుటయందు మిక్కిలి ప్రియము. అడవులలోనుండి మూలికాప్రభావముల నెఱింగి సింహశరభశార్దూలాది ఘాతుకమృగంబులు నిద్రించునప్పుడైనను దమజోలికి

రాకుండ వానినోళ్ళు కట్టివేతురు. కావున నీవిషయమునుబట్టి వీరికి మంత్రశాస్త్రములోఁ గూడఁ బ్రవేశ మున్నదనునూహ ప్రతిమానవునకు జనింపకపోదు. ఇట్టిప్రభావము గలవారు గనుకనే యడవిమృగములు మనయిండ్లలోని పిల్లులవలె వారి యిండ్లచుట్టును సంచరింపఁగలవుకాని యేహానిం గూడఁ గల్గింపవు.

వీరు వనములందుఁ బండించిన ధాన్యము, దుంపకూరలు, విశేషముగా భుజింతురు. పూర్వ మొకరాజు వేటకై యరణ్యమున కేగినప్పుడు నాటవికు లందఱు వానికి నుపకార మొనరించిరని వ్రాయుటవలన వారీసవరలవంటి యటవికయొక జాతివారై యుందురనుటకు సందియములేదు. వీరియందుఁ గలమంచిగుణ మేమనఁ దమ్ము నమ్మినవారినిఁ జెడఁగొట్టకుండుటయే. ఇట్టిజాతులకు ధనుర్విద్యాదుల నేర్పించిన, యుద్ధమునందు శత్రుసైన్యములఁ దునుమాడి జయంబుఁ గాంతురనుటలో నతిశయోక్తి లేదు. ఇట్టివారు కళింగదేశప్రాంతముల విశేషముగాఁ గాన్పించుచున్నారు. వీరికి రాజాదరణముమాత్ర మధికముగా నుండినచో వీరలవలన ననేకములగు గొప్పగొప్పకార్యములు నెఱవేరఁగలవు.

పూర్వశాసనముల విచారించిచూడ యుగాంతరముల నుండియు నీసవరజాతి యున్నట్లు ప్రమాణములు గాన్పించుచున్నవి. ఇటీవల దొరతనమువారు పర్వతప్రాంతములం దీజాతివారికి విద్యాశాలల నేర్పఱచి వీరిని విద్యావంతులనుగాఁ జేయుటకుఁ గడుఁబ్రయత్నములు చేయుచున్నారు కాని మొ

దటినుండి వనవాసముగుటచే విద్యలయందు మిగుల నాసక్తి కలవారు కాకపోయినను, సంతోషముతో నుద్యోగములం దాసక్తిగలవారై విద్య నభ్యసించుచున్నారు. అట్టివారికి నీ కాలమున నచ్చటచ్చటఁ బోలీసువిద్యాశాఖలలో నుద్యోగములు లభించుచున్నవి. ఇట్టివారందఱవలె మిగుల విద్యాభక్తులు గలిగి యున్నివిద్యలలో నేర్పరులైనయెడల దేశమునకు నుపకారము లాచరించువా రగుదురని నొక్కివక్కాణింపవచ్చును. ఇట్లు విద్యలయందుఁగాని వేషభాషలయందుఁ గాని ప్రీతి లేకుండుటకుఁ జిరకాలవిపినాంతరవాసమే ప్రధానకారణము.

---

## 9. కోదులు

ఈజాతివారు సామాన్యముగా గంజాం జిల్లాలోని గుమ్మూరు, ఉదయగిరి, రామగిరి మొదలగు తాలూకాలలో నివసించుచున్నారు. ఈతాలూకాలలో నీకోదుజాతివారు దాదాపు మూఁడులక్షలమంది జను లుందురని జనాభాసంఖ్య గలదు. వీరు తమను దాము కూయిలని చెప్పుకొందురు. వీరు కూడ సవరలవలె నాటవికులుగాని భిన్నులుగారు. వీ రుండు ప్రదేశములు శైలమయములును,వనమయములునై కాన్పించుచుండును. అచ్చట మిగుల నున్నతములైన పర్వతంబులు గలవు. కావున నట్టిచోట నుండుకొండలు, వనములు,లోయలు మొదలగునవి కన్నులపండువు నొనర్చుచు నాకమలగర్భుని

సృష్టినైపుణ్యమును వెల్లడించుచుండును. వారుండుచోట మందిరములు మనగ్రామములలోవలెఁగాక కొంచెము దూరము దూరముగా నుండును.

కోదులకుఁ బెంకుటిండ్లు లేవు. మనము రాతితోఁగాని మట్టితోఁగాని గోడలు పెట్టుకొని పెంకుతో నిండ్లు కప్పుకొందుము. కోదులు బల్లలతో గోడలుపెట్టి పైకప్పు కఱ్ఱలతోఁగాని దంటుతోఁగాని తెల్లుతోఁగాని వేసికొందురు. వారు ముఖ్యముగా సామానులు పెట్టుకొనుటకుఁ, బండుకొనుటకు, వంటకుఁ దగినట్లు మూఁడుగదులుమాత్రమే వేసికొందురు. ఎట్లున్నను మనయిండ్ల కున్నట్టివసతులు వారియిండ్ల కుండవు. మనలో నెంతపేదవాఁడైనను గాలివచ్చుటకుఁ జిన్నకిటికీ నొకదాని నింటి కమర్చుకొని యుండును. అది మంచిగాలి లోపలికివచ్చుట, చెడుగాలి వెలుపలి కేగుట, మొదలగు నుపకారము లొనరించుచు నారోగ్యము గలిగించుచుండును. ఎప్పుడైన గృహము లెత్తైనప్రదేశములందుఁ గట్టుకొని గాలి లోపలికి వచ్చునదుపాయము లేర్పఱచినఁగాని యారోగ్యము గలుగనేరదు. వీరియిండ్లకు గవాక్షము లుండవు. గదులు మిగుల నిఱుకుగలవై యుండును. బల్లిగుడాతాలూకాలోని కోదులు భూమిలో బిలంబులు త్రవ్వుకొని యాబిలంబులలో నుందురు. వీరు తక్కినకోదులకంటె ననాగరికులు. వీరిలోఁ గొందఱు వస్త్రంబుల ధరింపరనియుఁ, జెట్టుపట్టలతో శరీరమును గప్పుకొందురనియు వాడుకమాత్రముగలదు. వీనిసత్యాసత్యంబులు పూర్ణముగ విచారించినఁగాని తెలియవు.

వీరిభాషను కోదు, లేక కూయి, యనిపిలుతురు. ఈ భాష మాటలాడుటకుమాత్రమే వాడుకలో నున్నదిగాని వ్రాతలిపిమాత్రము కాన్పించదు. వీరిభాషలో నచ్చటచ్చటఁ గొన్నికొన్నిమాటలు తెలుఁగుభాషను బోలియుండును. ఈకోదుభాష నేర్చినవా రరుదుగానుందురు. వీరిదేశమున వర్షము, చలి, మిక్కుటముగా నుండును. ఈకోదుజాతివారు నిప్పుకుంపట్లుఁ బ్రక్కలఁ బెట్టుకొనినఁగాని రాత్రులందు నిద్రపోఁజాలరు. అచ్చటఁ జలి విశేషముగా నున్నందున మన్యజ్వరము లెప్పుడును వారల బాధించుచుండును. అందువలన నా జ్వరములచే వారు మిక్కుటముగాఁ బీడింపఁబడి తుదకు హతులయ్యెదరు. కావున వారికుటుంబములు వృద్ధికాఁజాలవు.

వారి కెప్పుడైనను వ్యాధులు సంభవించినపుడు సవరలలోవలె భగవంతుని నమ్మి దేవునివలననే యీవ్యాధులు గలిగినవని కోడిపిల్లనో, పందిపిల్లనో, బలియిచ్చి పూజసేయుదురు. వారిముఖ్యజీవనము వ్యవసాయము. నీటివసతి విశేషముగా నున్నందునఁబల్లపుభూములలో వరిపైరు సాగుచేయుదురు. ఇది యునుంగాక యరణ్యములఁ గాల్చి యాభూముల బాగుచేసి వర్షము గురిసినపిమ్మట నారిగ, కంది, మొదలగుమెట్టపైరులను గూడఁ బండింతురు. ఈ జాతివారు ధాన్యము లభించినంతవఱకు వరియన్నమునే తిందురు. అటుమీఁదట నారిగలు, మొక్కజొన్నలు, తిందురు. ఆ దేశములో నిప్పపువ్వు విశేషముగ దొరకుటచేఁ గోదు లందఱును, చెట్లక్రింద రాలినయిప్పపువ్వును బోగుచేసి తెచ్చి దానిని బియ్యముతోఁ గలిపి వండుకొని

భుజింతురు. జీలుగ చెట్లమధ్య భాగమున నుండు పదార్థమును దెచ్చి పిండిచేసి దానితో జావ కాచుకొని యాజావఁ ద్రాగుదురు. ఒక జీలుగు చెట్టు సామాన్యముగా నొక కుటుంబమునకు నొక నెలకు సరిపోవునంతటిపిండి నిచ్చును.

ఈ చెట్లు లేనపుడు కోదు లరణ్యమున నుండుదుంపలుగాని యాకులుగాని యుడుకఁబెట్టుకొని భుజింతురు. వారి కరణ్యములు, కొండలు నున్నంతవఱకు క్షామమనునది లేదు. ఆమెరక నేలలయందే, యావాలు, పసుపు మొదలైనవి పండింతురు. పసుపుమీఁద వచ్చినధనమును దాచిపెట్టి తమకుఁ గావలసినవస్త్రములు మొదలైనవానికి దానిని వినియోగింతురు.

కోదులు తమబట్టలను దామే యుదుకుకొని తమగడ్డముల క్షౌరకర్మముకూడఁ దమంతటఁ దామే చేసికొనువారగుటవలన మంగలిచాకలివృత్తులు వారిలో లేవు. కోదు దేశములోఁ బురుషులసంఖ్యకంటె స్త్రీలసంఖ్య తక్కువగా నుండును. వారివివాహములలో ముందుగా వరుఁడు పిల్లతల్లిదండ్రుల కేదేని కొంచెమో, గొప్పయో ధన మివ్వనిది వివాహములు జరుగవు. ఇవ్విధమునఁ బిల్లతల్లిదండ్రులు వరునివలన ధనముపుచ్చుకొన్నను దానినిఁ దమకుటుంబమున కుపయోగించుకొనక యింకను దమ సొమ్మును గొంతఁజేర్చి వివాహసమయమున జరుగవలసినబహుమతులకుఁగాని యాసంబంధము లగువిందులకుఁగాని వ్యయపఱతురు. వారిలోఁ జిన్నపిల్లలవివాహములు చాలఁదక్కువగానుండును. వయస్సు వచ్చినస్త్రీపురుషుల కే వివా

హములు జరుగును, గాని వివాహమునకు ముందు కొన్నిరోజు లుభయులకుఁ బరిచయము గలిగి ప్రేమలత సాగవలెను. వీరి కాటపాటలయందు మిగులసంతోషము కలదు. వయస్సువచ్చిన పిల్లలనైనను రాత్రిసమయములందుఁ దల్లిదండ్రులు నాట్యశాలలకుఁ బంపుదురు. అచటికి యుక్తవయస్సు వచ్చినబాలురుగూడ వత్తురు. పిమ్మట నందఱును గలిసి కొంతకాల మాటపాటలతోఁ బ్రొద్దుపుచ్చి వేఱువేఱుగా శయనింతురు. ఇట్టి స్థలముననే మొదట బాలబాలికల కనురాగాంకురములు మొలకలెత్తి తరువాత వివాహములు జరుగుచుండును.

వీరిమతములో వివాహమైనపిదప వధూవరులు గర్భాధానమునకు వనంబునకేగి యచట నాలుగైదుదినంబు లుండి వచ్చి వెంటనే వేఱొకయిల్లు నిర్మించుకొని వేఱుగానుందురు. వరుఁడు తండ్రియిష్టానుసారముగా భూములు, జీలుగచెట్లు, మొదలైనవి తీసికొనును. వీరిజాతిలో స్త్రీలకు ఘోషయనునది లేదు. వారలకుఁ బాశ్చాత్యులలోవలె స్వాతంత్ర్యము మిక్కుటముగా నుండును. సవరలలోవలె స్త్రీలు మొలలవఱకే వస్త్రముల ధరింతురు.

వీరు సామాన్యముగా గంజితోఁ గలిసినయన్నమును భుజింతురు. పొలములలోఁగాని, వనభూములయందుఁగాని, కష్టపడి పనిచేయుచున్నను వేళతప్పక క్రమముగా నాహారమును దీసికొందురు. వీ రెంతధనమును సంపాదించుచున్నను సారాయిత్రాగుట, పొడుము తినుట, యనునీరెండుదురభ్యాసములు వీరిదరిద్రదశకుఁ బ్రధానకారణములు. ఇట్టిదురభ్యాస

భుజింతురు. జీలుగచెట్లమధ్యభాగమున నుండుపదార్థమును దెచ్చి పిండిచేసి దానితో జావ కాచుకొని యాజావఁ ద్రాగుదురు. ఒకజీలుగుచెట్టు సామాన్యముగా నొకకుటుంబమునకు నొకనెలకు సరిపోవునంతటిపిండి నిచ్చును.

ఈ చెట్లు లేనపుడు కోదు లరణ్యమున నుండుదుంపలుగాని యాకులుగాని యుడుకఁబెట్టుకొని భుజింతురు. వారి కరణ్యములు, కొండలు నున్నంతవఱకు క్షామమనునది లేదు. ఆమెరకనేలలయందే, యావాలు, పసుపు మొదలైనవి పండింతురు. పసుపుమీఁద వచ్చినధనమును దాచిపెట్టి తమకుఁగావలసినవస్త్రములు మొదలైనవానికి దానిని వినియోగింతురు.

కోదులు తమబట్టలను దామే యుదుకుకొని తమగడ్డములక్షౌరకర్మముకూడఁ దమంతటఁ దామే చేసికొనువారగుటవలన మంగలిచాకలివృత్తులు వారిలో లేవు. కోదుదేశములోఁ బురుషులసంఖ్యకంటె స్త్రీలసంఖ్య తక్కువగా నుండును. వారివివాహములలో ముందుగా వరుఁడు పిల్లతల్లిదండ్రులకేదేని కొంచెమో, గొప్పయో ధన మివ్వనిది వివాహములు జరుగవు. ఇవ్విధమునఁ బిల్లతల్లిదండ్రులు వరునివలన ధనముపుచ్చుకొన్నను దానినిఁ దమకుటుంబమున కుపయోగించుకొనక యింకను దమ సొమ్మును గొంతఁజేర్చి వివాహసమయమున జరుగవలసినబహుమతులకుఁగాని యాసంబంధము లగువిందులకుఁగాని వ్యయపఱతురు. వారిలోఁ జిన్నపిల్లలవివాహములు చాలఁదక్కువగానుండును. వయస్సు వచ్చినస్త్రీపురుషులకే వివా

హాములు జరుగును, గాని వివాహామునకు ముందు కొన్నిరోజులుభయులకుఁ బరిచయము గలిగి ప్రేమలత సాగవలెను. వీరి కాటపాటలయందు మిగులసంతోషము కలదు. వయస్సువచ్చినపిల్లలనైనను రాత్రిసమయములందుఁ దల్లిదండ్రులు నాట్యశాలలకుఁ బంపుదురు. అచటికి యుక్తవయస్సు వచ్చినబాలురుగూడ వత్తురు. పిమ్మట నందఱును గలిసి కొంతకాల మాటపాటలతోఁ బ్రొద్దుపుచ్చి వేఱువేఱుగా శయనింతురు. ఇట్టి స్థలముననే మొదట బాలబాలికల కనురాగాంకురములు మొలకలెత్తి తరువాత వివాహములు జరుగుచుండును.

వీరిమతములో వివాహామైనపిదప వధూవరులు గర్భాధానమునకు వనంబున కేగి యచట నాలుగైదుదినంబు లుండి వచ్చి వెంటనే వేఱొకయిల్లు నిర్మించుకొని వేఱుగానుందురు. వరుఁడు తండ్రియిష్టానుసారముగా భూములు, జీలుగచెట్లు, మొదలైనవి తీసికొనును. వీరిజాతిలో స్త్రీలకు ఘోషయను నది లేదు. వారలకుఁ బాశ్చాత్యులలోవలె స్వాతంత్ర్యము మిక్కుటముగా నుండును. సవరలలోవలె స్త్రీలు మొలల వఱకే వస్త్రముల ధరింతురు.

వీరు సామాన్యముగా గంజితోఁ గలిసినయన్నమును భుజింతురు. పొలములలోఁగాని, వనభూములయందుఁగాని, కష్టపడి పనిచేయుచున్నను వేళతప్పక క్రమముగా నాహారమును దీసికొందురు. వీ రెంతధనమును సంపాదించుచున్నను సారాయిత్రాగుట, పొడుము తినుట, యనునీరెండుదురభ్యాసములు వీరిదరిద్రదశకుఁ బ్రధానకారణములు. ఇట్టిదురభ్యాస

ముండుటచే నింటిలోనివస్తువులనుగూడఁ గుదువఁబెట్టి పోషుము కొందురు. దీనివలన వీరిదేహారోగ్యము మిగుల నశించుచుండును. భోజనము లేకున్న నుందురుగాని, నశ్యము లేనిది క్షణకాల ముండలేరు.

కోదుజాతివారికి భూములశిస్తు లేదు. పూర్వకాలమున వారి దేశములో నరబలు లుండినవని పెద్దవాడుక కలదు. ఇట్టి బలు లిచ్చి యారక్తమాంసములను భూమిలోఁ గలిపినయెడల భూమి ఫలించుననునూహ వారికిఁ గలదు. అందునిమిత్తమై వారు గ్రామంబులఁ దిరిగి కసాయివాండ్రు పశువులను గొని తెచ్చినట్లు పిల్లలను గొనితెచ్చి మేఁకపోతులవలె వారిని బాగుగఁ బెంచి పెద్దవాండ్రను జేయుచుందురు. ఇట్టిదురాచారమును మాన్పుటకు గవర్నమెంటువారు గట్టిపట్టుదలతో వీరి దేశమునఁ గొంతసైన్య ముంచిరనియు, నాసేనలు నిర్భయంబునఁ దమతో నెదుర్కొనినకోదులను జయించి పైవిధంబునఁ బెంపఁబడుచున్నవారిని బంధవిముక్తులఁ జేసి శాంతిని నెలకొల్పిరనియు, నట్టిసమయమున దొరతనమువారు కోదులభూములకుఁ బన్నులు లేకుండఁజేసిరనియు నాదేశమున నిప్పటికినిఁ జెప్పుకొందురు.

కాని దీనికిఁదగినలిఖితనిదర్శనము లంతగాఁ గాన్పింపవు. ఎట్లైనను వీరు ముఖ్యముగాఁ వ్యవసాయము మొదలగుపనులు చేసి జీవింతురు. వీ రరణ్యములలో నుండుటచే వీరి కొకమంచి సౌకర్యము గలదు. అచ్చట జీలుగుచెట్లు విశేషముగా నున్నందున నందఱును బ్రాతఃకాలము మొదలు సాయంకాలమువఱకు

నచటనే యుండి యాచెట్లనుండి కల్లుదీసి తృప్తిగాఁ ద్రాగు గురు. కొబ్బరిచెట్లుగాని, తాటిచెట్లుగాని యచ్చట లేవు. ఈఁతచెట్లు కొంచె మున్నను వానినుండి కల్లుదీయుదురు. మన దేశములోఁ జాలకాలమునుండి యిప్పసారా వాడుకలో నున్నది. అది తియ్యగాను, త్రాగుటకు నారోగ్యకరమైనదిగా నుండునని చెప్పుదురు. ఈ యిప్పపువ్వుసారా తయారుచేయు టలోఁ గోదువారు మిగులసమర్థులు. ఈసారాను గార్యముల పట్ల విశేషముగా నుపయోగింతురు. ఈజాతివారికి సారా యందుఁ బ్రీతి విశేషముగాఁగలదు. వారు తమభూములు పో యినను సారామాత్రము తప్పక త్రాగి తీరవలెను. మనదేశ ములోఁగూడఁ బెద్దపెద్దకుటుంబములవారు తమసర్వస్వము పో యినను, ఋణగ్రస్తులైనను, సారా త్రాగితీరవలసినదే. కావున నా దేశమునఁగూడఁగోదులలో నిట్టివా రనేకులు గలరు. తాము ఋణములపాలై తమయాస్తినైనను విడిచిపెట్టుదురుగాని త్రా గుడుమాత్రము విడువరు. ఇట్టిదురాచారములవలననే కోదు వారు నిత్యదరిద్రులై క్షీణించుచున్నారు.

ఈ విషయములను విచారించి గవర్నమెంటువారు తమ కిందువలన వచ్చులాభ మధికమైనను, కోదువారికి హాని మెం డుగాఁగలుగుచున్నదని విచారించి కొన్నిసంవత్సరములక్రిందట నీదుకాణములను మూయించివేసినారు. ఇట్లు చేసినను వీరు శుభాశుభకార్యంబులందు నీయిప్పసారాను దయారుచేయుదు రుగాని విక్రయించుటకుమాత్రము వలనుపడదు. చాలకాలము నుండి మద్యపానమునకు వీరలవాటుపడినవారు కాఁబట్టి యా

యాచారము కోదులు విడువలేకున్నారు. అచ్చటచ్చట నల్ల మందు దుకాణములు, గంజాయిదుకాణము లున్నను, కోదు లకుమాత్రి మవి యుపయోగింపవుకాని వాని నోథుని లుప యోగించుకొందురు.

వీ రుండుప్రిదేశములలోఁ గంకరరోడ్లు విశేషముగా లేకపోయినను; వర్షాకాలముదప్పఁ దదిర కాలముల బండ్లరాక పోకల కేవిధముతైనయాటంకములు లేవు. ఈకోదువారు వం తెనలు కట్టుటలో మిక్కిలినేర్పరులు. కఱ్ఱలతోఁగాని, దూల ములతోఁగాని, వంతెనలు తయారుచేయుదురు. ఇట్టివి వాగుల మీఁదఁగూడ నేర్పఱతురు. కోదు లమాయకులు, నాత్మగౌర వముగలవారునై యుందురు. ఇతరులధన మేమాత్రిమును గోరరు. తమకున్నది యితరులకు ధర్మముఁజేయుటలో వెను దీయరు. ఇట్టియమాయకులను బట్టుదలతో విద్యావంతుల నుగాఁ జేయుటకుఁ గొందఱ నుద్యోగస్థుల నియమించి గవ ర్నమెంటువారు చాలశ్రిమపడుచున్నారు.

వీరి యాచారములకు సవరలయాచారములకు మిగుల వ్యత్యాసము లున్నవి. పూర్వ మనాగరికులై మృగములవలె నరణ్యములలో సంచరించుచు మూర్ఖత్వము గలిగియున్నను, గవర్నమెంటువారివలన నిటీవల నీకోదుజాతివా రందఱు వృ ద్ధిలోనికి వచ్చుచుండిరి. వీ రింటిదగ్గర నున్నపుడు గాకుండ గవర్నమెంటువారిసామానులు మొదలగునవి మోసికొనిపోవు నపుడు సొరకాయ బుఱ్ఱలలో గంజి పోసి కలిపినయన్నమును బోసికొని వెంటఁదెచ్చుకొని వేళయగుసరికి సామానులు దింపి

యాగంజియన్నమును భుజించి మరల సామానులు తీసికొని పోవుదురు. వీరిలోఁ గొన్ని కొన్ని విషయములలోఁ బాశ్చాత్త్యులయాచారములు గలవు. వీరందఱును గష్టించిపని చేయుటలో సమర్థులు.

వీరు చక్కఁగా వ్యవసాయము చేసికొని ధాన్యములను బండించి తమకుఁగావలసినవాని నింట నుంచుకొని మిగిలినవి విక్రయింతురు. వీరు మెట్టపంటలలో నావాలు, మొక్కజొన్నలు మొదలైనవి పండింతురు. ఇవియునుంగాక మెరపకాయలు, దుంపకూరలు మొదలైనవానినిఁగూడఁ బండించి దగ్గరనున్న గ్రామాదుల కరిగి వానిని విక్రయించి ధనముగడింతురు. మఱియు వీ రరణ్యములలో నుండువా రగుటవలనఁ గట్టెలకు మాత్రము మిగులశ్రమపడవలసినంతయవసర ముండదు. వీరు కూరలు మొదలైనవానివలనఁ గాకుండఁ గట్టెలవలనఁగూడ ధనము సంపాదింతురు. ఎంతసంపాదించినను నిత్యదరిద్రులే కాని కలవారనిమాత్రము చెప్పసాహసింపఁగూడదు. ఇందుకు వీ రమాయకులై పురోభివృద్ధిమార్గంబుల విచారింపక ధనమంతయు మద్యపానము మొదలగుదుర్వినియోగములకు వెచ్చించుటయే ప్రధానకారణము.

వీ రుండుతాలూకాలలో సామాన్యజ్ఞానము నలవడఁ జేయువిద్యాశాలలు గలవు. కాని యందు నూటికి 50 మంది కోదుజాతివారిపిల్లలే చదువుచున్నారు. తక్కినవా రోఢ్రులు. స్వభావములో నోఢ్రులపిల్లలకంటెఁ గోదులపిల్లలు తెలివిలోఁ దీసిపోవువారు కారు. ఐనప్పటికి వీ రోఢ్రులకంటె నోఢ్రభాష

నేర్పుటలో వెనుకంజవేయుచుందురు. అచ్చట నున్నయుపాధ్యాయులు కోదుభాషలోనే పిల్లలకుఁ దగినసర్వవిషయములను బోధించుచుందురు. ఎలిమెంటరీస్కూళ్ళలోఁ జదివి వృద్ధికివచ్చినకోదుబాలుర నుపాధ్యాయులుగఁ దీసికొనుచున్నారు. విద్యాభివృద్ధి యొనరించునుద్దేశముతో నిట్టికోదుబాలురకు గవర్నమెంటువారు జీతము లెక్కువగా నిచ్చుచున్నారు. ఇట్టి విద్యాశాలలవిషయమై దొరతనమువారు మిక్కిలిధనమును వెచ్చించుచున్నారు. ఉదయగిరితాలూకాప్రాంతములలో నున్న కోదువారు రోఢ్రిముకూడ మాట్లాడఁగలరు. వీరు గవర్నమెంటువారిసంబంధము లగుకొన్నిపనులు లెప్పుడును జేయుచుందురు.

వీరికిఁ గోయసవరజాతులవలె నరణ్యావాస మున్నప్పటికి నోషధు లేమియు నంతగాఁ దెలియవు. పూర్వమువలెఁ గాక యిప్పుడిప్పుడు వారిజాతిలోఁగూడ నాగరికత హెచ్చినది. చాలవఱకు కమాయకత్వముకూడఁ బోయినదనియె చెప్పవచ్చును. వారిజాతిలో నైదారుగురుపిల్లలకంటె మిక్కుటమగు సంతానము గలకుటుంబములు చాలఁదక్కువగా నుండును. వారు తమకు జబ్బులేమైనఁ గలిగినయెడల నౌషధము లుపయోగింపక యవి దేవునివలనఁ గలిగినవని భావించి యాదేవతాసంప్రీతికై తగినబలు లిచ్చుచుందురు. ఏవిషయమందైనను వారు ముఖ్యముగా దేవతలనే నమ్మి కొలుచుచుందురు. దేవతలకు సంతృప్తియైనఁగాని తమకుఁ దృప్తిగల్గదు. సర్వశుభములకు భగవంతుఁడే కారణమని పూర్ణవిశ్వాసముతో దేవుని బ్రార్థించుచుందురు.

---

# 10. సింహాచలక్షేత్రము.

పూర్వయుగమున సనకసనందను లనుమహామునులై దేండ్లయీాడున దిగంబరులై వైకుంఠమున కరిగి విష్ణుసందర్శనార్థము లోనికేగుచుండ నట దౌవారికు లగుజయవిజయులు కోపించి లోపలికి పోనీక యడ్డగించిరి. అంతట నామునులు కోపోద్దీపితమానసులై మాపవిత్రభావము తెలియక మ మ్మడ్డగించితిరి కావున మీారు విష్ణుసాన్నిధ్యము వీడి రాక్షసులై పుట్టుఁడని శపించిరి. ఆశాపంబునకు వారు చింతిల్లి మహామునిచంద్రులారా! మేము తెలియక చేసితిమి. అంతమాత్రమున మాకిట్టి ఘోరశాపం బీయఁదగునె? దయార్ద్రహృదయులై మమ్మాదరించి శాపమోక్షణంబు దయసేయుఁడని ప్రార్థించిరి.

అంతట వారిప్రార్థనల నంగీకరించి సనకసనందనులు కరుణారసపరిపూర్ణహృదయులై దౌవారికులారా! మాశాపం బమోఘంబు. దానిని మరలింప నేరవలనను గాదు. తుదకు మేమును దీర్పఁజాలము. కావున నేడుజన్మము లెత్తి శ్రీహరితో సఖ్యంబుఁ జేసికొనియైనను, మూఁడుజన్మము లెత్తి శత్రుత్వముఁ బూనియైనను, మరల వైకుంఠముం జేరుదురని శాపమోక్షణం బానతీయ జయవిజయులు వారలకు నమస్కరించి విష్ణుసాయుజ్యంబు వీడి తొలిజన్మంబున దితి యనురక్కసికి హిరణ్యాక్షహిరణ్యకశిపులై జన్మించిరి.

హిరణ్యాక్షుఁడు నిర్వక్రవిక్రమసమన్వితుండై యింద్రాద్యష్టదిక్పాలురను, గరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధసా

ధ్యవిద్యాధరాదులను, నవగ్రహంబులను, బాధించుచు లోకం బంతయు హింసించుచుండె. అంతట బ్రహ్మేంద్రాదిదేవతలు వైకుంఠమున కరిగి విష్ణుదేవుఁబ్రార్థించిరి. అప్పు డాశ్రీమన్నారాయణుండు చక్కఁగ విమర్శించి సురలారా ! సమయమును జూచి మీకష్టంబులఁ దీర్చెద, మీమీనివాసంబుల కరుగుఁడు; భయపడవలదని వారలఁ బంపి పిమ్మట భూదేవి మొర లాలకించి వరాహావతారంబుఁ దాల్చి లోకకంటకుం డగునాహిరణ్యాక్షుని వధించి నిఖిలలోకములకు నానందముం గలిగించె.

పిమ్మట హిరణ్యకశిపుండు తన తమ్ముని శ్రీహరి వరాహావతారంబునఁ జంపిపోయెననువృత్తాంతంబు విని వానిని సాధింపఁ బ్రయత్నించి తనభటవర్గంబును బిలిచి భటులారా ! మీరు సత్వరంబున నాయుధపాణులై శ్రీహరిని సాధించి తీసికొనిరండు. అతఁడు తులసీవనంబులు, భక్తహృదయంబులు, సురలోకము, క్షీరసాగరము, యజ్ఞాలయంబులు మొదలగు చోట్ల నివసించియుండును. కావున వీని నన్నిటిని దగ్ధమొనరించి వానిని సాధించి తీసికొనిరండు. లేనిచో మనవిరోధములు తీరవు ; పొండని వారలం బంపె.

అంతట వారు వివిధాయుధపాణులై వెడలి నిఖిలలోకంబులం దిరిగి హరి నెచ్చటను గానక మరలివచ్చి హిరణ్యకశిపునితో స్వామీ ! సర్వభువనంబులందు నన్వేషించితిమి కాని హరి యెచ్చటను గానరాఁడని విన్నవించిరి. ఆమాట లాలించి హిరణ్యకశిపుఁడు వారలఁ దిట్టి నేనే సాధింతునని సభలోఁ బ్రతిజ్ఞయొనర్చి తా నొక్కఁడు బయలువెడలి మందర

పర్వతంబున కఱిగి యచటఁ గాలిచిటికెనవ్రేలిమీఁద లేచి
నిలఁబడి యనేకదివ్యవర్షంబులు బ్రహ్మనుగూర్చి తపంబొన
రించె. అత్తపోవహ్నిజ్వాలలకుఁ దాళలేక దేవతలు బ్రహ్మ
దాపున కరిగి స్వామీ! దితిపుత్త్రుం డగుహిరణ్యకశిపునితపో
వహ్నిజ్వాలలకు మేము తాళలేకుంటిమి. కావున వాఁడు గోర
నవరంబులు వాని కొసంగి మమ్ములఁ గాపాడుఁడు. ఇప్పు డా
తఁడు మందరగిరియం దున్నవాఁడు. తా మాలసింపకుఁడని
ప్రార్థింప వారిప్రార్థన లంగీకరించి బ్రహ్మదేవుఁడు వారల
నంపి తాను మందరాద్రి కేగుదెంచి తీవ్రతపోమహిమచే నల
రారు నాహేమకశిపుం గాంచి యిట్టితపం బిదివఱ కెవ్వరును
జేయలేదు. ముందును జేయువా రెవ్వరును లేరని యాశ్చర్య
మొంది వానిని సమీపించి రాక్షసేంద్రా! నీతపస్సునకు మె
చ్చితిని. కావలసినవరంబుల వేడుమన నారాక్షసేశ్వరుండు
కన్నులు విప్పి బ్రహ్మను జూచి వానికి నమస్కారంబు లాచ
రించి దేవా! తాము నాయందు దయార్ద్రహృదయులై వర
ము లొసంగుట కేగుదెంచితిరి. మీవంటికరుణాకలితాత్ములు
మఱెవ్వరైనఁ గలరా? నావరములను దెల్పెద వినుఁడు.

నేను పంచభూతములచేతఁగాని, భూమిలోఁ బుట్టిన
యేజంతువులచేతఁగాని, యుద్ధమునందుఁగాని, రాత్రిగాని,పగ
లుగాని, యింటఁగాని, బైటఁగాని, మానవునిచేతఁగాని, దేవ
తలచేతఁగాని, రాక్షసులచేతఁగాని, చావకుండునట్లు వర మను
గ్రహింపుఁడని ప్రార్థించె. అంత నాకమలగర్భుం డామాటల
నాలకించి దానవేంద్రా! యిట్టివరముల నిదివఱ కెన్నడు

నెవ్వరుఁగోరరు. ఐనను నీతపస్సునకు మెచ్చి నీవడిగినవరంబు లనుగ్రహించితి. కావున నిఁక నీవు నీపురంబున కరిగి ధర్మ మార్గప్రవర్తకుఁడవై రాజ్యముపాలింపుమని బ్రహ్మ యాన తిచ్చి వానినిం బంపె.

ఇవ్విధంబున నాహిరణ్యకశిపుండు బ్రహ్మవరప్రభావం బున మదించి మన్ను మిన్ను గానక లోకముల బాధించు చుండె. అట్టిసమయమున దేవతలందఱు వానిధాటికిఁ దాళ లేక బ్రహ్మరుద్రుల నాశ్రయించి యాశారహితులై తుదకు వైకుంఠమున కేతెంచి శ్రీహరిని వీనిదుండగములఁ జెప్పి రక్షిం పుమని ప్రార్థించిరి. అంతట శ్రీహరి దేవతల నోదార్చి మీభ యంబుఁ బాపెద మీ రింకఁబొండని వారలఁ బంపి తాను బ్ర హ్మవరంబుల విమర్శించి యుపాయముదోఁచక చివరకు నరసిం హమూర్తియై సమస్తజీవరాసులయందుఁ బ్రకాశించుచుండె. అట్టిసమయమున నాతనికిఁ బ్రహ్లాదుఁ డనునొకకుమారుండు గలఁడు. ఆతఁడు హరిభక్తుఁడు. ఎప్పుడును శ్రీమన్నారాయ ణునిగాని తదితరులఁ గలనైనం దలఁపఁడు. ఇట్లుండఁ గుమారు నికి శత్రుపక్షధ్యానంబు లెవ్వరో నేర్పిరని తలఁచి వానికి జ్ఞా నంబుం గలిగింప గురువులయొద్ద విద్యాభ్యాస మొనర్పించెను. కాని యాతఁడుమాత్రము హరిధ్యానమును విడువక గురువు లింట్లకేగినప్పుడు రాక్షసబాలుర నెల్లరను బిలిచి మనగురువులు చెప్పుశాస్త్రములు నీతిదాయకములు గావు. మానవుఁ డెప్పు టికైనను బుట్టనిచావనిమార్గము నన్వేషింపవలయునుగాని యిట్టివ్యర్థములైనమార్గములతో మానవునకు లాభము లేదని

చెప్పి వారి దుశ్చింతలు మాన్పించి విష్ణుభక్తి నలవడఁజేసెను. పిమ్మటఁ గొంతసేపటికి గురువులు వచ్చి యీవిషయంబు గమనించి వెంటనే పోయి హిరణ్యకశిపునకుం జెప్పిరి.

అంతట నాతఁడు కుమారునిం బిలిపించి నీవు దుశ్శీలంబున వర్తించుచుంటివని పింటిని. నీ వవలంబించినభక్తి మనవంశమునకుఁ దగదని యెన్నిబోధించినను విననందునఁ గోపించి వానిని హింసింపఁజొచ్చెను. ఇట్లెన్నిహింసలు పెట్టుచున్నను వాని కణుమాత్రమైనను బాధలేక శ్రీహరికృపారసంబున సంతోషితస్వాంతుఁడై యెప్పటియట్ల వర్తిల్లుచుండె. ఆవిషయంబుఁ జూచి నిన్ను రక్షించువాఁ డెవఁడు ? సర్వలోకములు నాకు లోఁబడియుండ నాకంటె నీకు మఱియొకరక్షకుండు గలఁడాయని నుడివి నీకు రక్షకుఁ డగుశ్రీహరి నిందుఁజూపఁ గలవా యని సభామధ్యంబున నొకస్తంభంబుం జూపి యడిగె.

అందులకుఁ బ్రహ్లాదుఁడు సంతసంచి యీ స్తంభము ననే కాదు; నీకును, నాకును, సర్వలోకములకును రక్షకుఁ డగుశ్రీహరి బ్రహ్మాండంబునం దంతటను నిండియున్నాఁడు. నీవు నిశ్చలమనస్కుండవై యున్న నాభగవంతుఁడు నీ కిందుఁ బ్రత్యక్షముకాఁగలఁ డనివచింప నాదానవేంద్రుండు కోపంబుచేఁ దనచేత నున్నఖడ్గంబు విసరి యా స్తంభంబున వైవ సర్వలోకభయంకరుఁడై యష్టబాహువులు గలిగి నిజతేజోవిసరంబుల దుర్నిరీక్ష్యుండై సింహాకారంబున స్తంభమును బ్రద్దలొనర్చుకొని ప్రత్యక్షమై హిరణ్యకశిపునిఁబట్టి తనతొడలమీఁద వైచుకొని సాయంసమయమున నిజఖరనఖరనికరంబు

లతో వానియుదరంబుఁ జీల్చి భక్తుం డగుప్రహ్లాదుని రక్షించి లోకంబులకు మేలు గలిగించె.

అంతట దేవతలెల్లరు పుష్పవృష్టిఁ గురిపించిరి. గంధర్వులు గానంబులొనర్చిరి. ప్రహ్లాదుఁడు సింహాకృతిఁ దనరారు శ్రీహరిని ధ్యానమొనర్చి శాంతుంజేసె. అది మొదలుకొని యీనరసింహస్వామి యిచట నిలిచెననియు, లోకోద్ధరణార్థమై యీస్వామిని బ్రహ్లాదుఁ డిచ్చటఁ బ్రతిష్ఠించెననియు, స్థలపురాణము చెప్పుచున్నది. కావున నీసింహాచలము వైష్ణవక్షేత్రమన నొప్పుచున్నది.

కాఁబట్టి యుగాంతరములనుండి ప్రహ్లాదునిచేఁ గట్టింపఁబడినయాలయమంటపప్రాకారాదులు శిథిలములై పుట్టలు బలిసి లోపలనుండుమూర్తికిఁ బాతాళలోకమునఁ బూజాదులు జరుగుకాలములోఁ బురుకుత్సుఁడను పేరుగలయొకరాజేంద్రుఁడు ధర్మనిరతుండును, బరోపకారపారీణుండును, సత్యనిష్ఠాపరుండును, దుష్టశిక్షణుండును శిష్టరక్షణుండునునై, రాజ్యంబేలుచుండె వానిరాజ్యములోనినాల్గుజాతులవారును శ్రద్ధాళువులై తమతమవర్ణాశ్రమాచారంబులఁ జక్కఁగ నెఱవేర్చుచుండిరి. జారచోరశిఖామణు లాపురమునఁ గలికంబునకైనఁ గానరారు. ప్రజలందఱు నిఖిలవైభవోపేతులై కష్టంబులనునవి యెఱుంగక సురలోకసౌఖ్యంబులం బోలుసౌఖ్యంబుల ననుభవించుచు హరిభక్తిపరాయణులై యొప్పుచుండిరి. ఆతనికాలమున భూములు చక్కఁగఁ బండుచుండెను.

ఇవ్విధంబున ధర్మమార్గ బవలంబించి రాజ్యంబుఁ జేయునీరాజేంద్రుఁడు నిఖిలాయుధపరిశ్రమములం దతిసిపుణుఁడును మృగయావినోదరతుండును నై యొకానొక సమయంబునఁ జతురంగబలసమేతుండై మృగయావినోదార్థము మహారణ్యంబునకు బయలువెడలెను. అప్పుడు జయభేరీనినాదంబులు, నేనుఁగులఘీంకారంబులు గుఱ్ఱములసకిలింతలు, రథనేమినినాదంబులు మిన్నుముట్టెను. సౌధోపరిభాగంబుల నివసించి కాంతాలలామలు రాజేంద్రునిమస్తకంబుఁ గుసుమవిసరంబుల నలంకరించిరి. పౌరు లందఱు కొంతదూరమువఱకు రాజు నంపి పురమునకు మరలిరి. ఇవ్విధంబున రా జరణ్యమును బ్రవేశించి వేఁట ప్రారంభించెను.

వేటకాండ్రును, వేఁటకుక్కలును, చుట్టును జుట్టుకొన్నందువలన నెటకేగుటకైనను దారి తోఁచక యిష్టానుసారంబుగా ఘాతుకమృగంబు లావిపినంబున నానాముఖంబులఁ బాఱసాగెను. అప్పుడు పురుకుత్సుఁడు భటుల వెంటఁబెట్టుకొని పోయి సింహశరభశార్దూలాదిమృగంబులపైఁ దీవ్రబాణంబులం బ్రయోగింప నాబాణఘాతంబులకుఁ దాళలేక మృగంబులు కుప్పలుకుప్పలుగాఁ గూలసాగెను. ఇట్లు కొంత తడవు వేటసలిపి యాశ్రమమును బోఁగొట్టుకొనునిమిత్తమై యొక తియ్యమామిడిచెట్టుక్రింద విశ్రమింప నందు శుకపికశారికామయూరాదివిహంగనిస్వనంబులు శ్రవణానంద మొనర్పసాగెను. అట్లు కొంతతడవట విశ్రమించి మరల బయలు

దేరి పురంబున కేగుచు నీక్షేత్రంబును సమీపించి దీనివిశేషం బుల గమనించుతలంపుతో నట విడిసెను.

ఆసింహాచలము సుగంధకుసుమఫలభరితములైన పాదప సందోహములతో విలసిల్లి మహామునులకు నివాసయోగ్య ముగా నుండెను. నేల యంతయు మెత్తనిపచ్చికతో నేత్రో త్సవంబుఁ గావించుచుండెను. వివిధవిహంగసంతానంబులు పాదపాగ్రంబుల నధివసించి శ్రవణానందకరంబు లగు స్వరం బులతో గాన మొనర్చుచుండెను. చెట్లకొమ్మ లగ్రములగా మస్తకంబుల నానుచుఁ జాందినీలుగట్టిన ట్లతిరమణీయంబులై విరాజిల్లుచుండెను. చివురుజొంపములతో విలసిల్లు వృక్షంబులు బాటసారులకు విశ్రాంతి నిచ్చుచున్నవి. క్రింద రాలినయాకుల మొత్తంబులు పాంథులపాదములకుఁ బఱచినపఱపులవలెఁ బ్రకాశించుచున్నవి. అల్లిబిల్లిగ నల్లుకొనినసంఫుల్లకుసుమలతా మందిరంబులు శ్రీమాఁకనోదార్థమేర్పఱచినయిండ్లవలె విరా జిల్లుచున్నవి. మందమారుతములచే నల్లలనాడుకొమ్మలనుండి రాలు కుసుమంబులు రాజున కావనదేవత యొనఁగుపూజను దెలుపుచున్నవి. చిత్రవర్ణములు గలపక్షులు లాపర్వతంబున నిండి యుండ నాస్థలం బింద్రచాపంబులతో సంపూర్ణమైనదానివలెఁ గాన్పించుచుండెను. ఇట్లు పర్వతంబునం గలవనంబు వీక్షిం చుచు మఱికొంత లోనికేగ నట శాఖామృగసంతానంబులు గంతులువేయుచుఁ గాన్పించెను. ఒకవైపునశిలలనుండిమృదంగ ధ్వనుల ధిక్కరించుశబ్దములతో సెలయేళ్ళు పాఱుచుండెను.

ఆప్రదేశంబులందుఁ బచ్చికబయళ్ళమీఁద హరిణనికరంబులు హెచ్చుగ ముచ్చటలుమీఱ విచ్చలవిడిగా విహరించుచున్నవి.

ఇట్టి సుందరం బగుపర్వతవనప్రదేశంబు వీక్షించి సంతోషంబునఁ గొంతతడ వట విశ్రమించి తిరిగి వెలుపలికి వచ్చి యాక్షేత్రంబునం గలపురాతనాలయచిహ్నములఁ జూచి వానిఁ ద్రవ్వించి తగుశిల్పులను బిలిపించి తిరిగి యాలయనిర్మాణంబుఁ జేయించి తగినగోపురప్రాకారమంటపాదులఁ గట్టించి మూర్తిం బ్రతిష్ఠించెనని యొకపురాణగాధ కలదు. ఇదియునుంగాక శాసనములంబట్టి విచారింప నేడవశతాబ్దమునకుఁ బూర్వమే యాలయాదులు గట్టింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. మఱియుఁ బ్రాచీనమగువాయుపురాణమునందుఁగూడ సింహాగిరిని గుఱించి చెప్పుటవలన నీక్షేత్రము పురాతనక్షేత్రమని స్పష్టపడుటకు సందియము లేదు.

ఈక్షేత్రమున నరసింహస్వామి దివ్యతేజోమూర్తియై భక్తులకోరికల నెఱవేర్చుచు భక్తవత్సలబిరుదాంకితుండై విరాజిల్లుచుండెను. ఈ సింహగిరీంద్రుని దేవాలయప్రాకారములు దాదాపు మైలుచతురము గలిగి యాంజనేయునిచే రక్షింపఁబడుచుండును. క్రీ. శ. 11 వ శతాబ్దమున గాంగవంశీయుఁడగునరసింహరాజుచేఁ గట్టింపఁబడిన ముఖమంటపములో నెందఱెందఱో మహారాజులు స్వామిభక్తితత్పరులై సమర్పించిన మణిహారములు, సువర్ణాభరణములు, హేమమయ విమానములు, కనకమయపాత్రలు మొదలగువస్తుసముదాయములు బిండారీ లొనరించుదౌర్జన్యమునకు భయపడి 18 వ

శతాబ్దమున రహస్యముగా దాచిపెట్టఁబడె ననుజనశ్రుతి యొ
కటి గలదు.

ఇవ్విధంబున నాక్షేత్రమాహాత్మ్య మొప్పుచుండఁ
గొంతకాల మైనపదంపడి పిండారిదండు దేవాలయమును దో
చుకొనుటకు వచ్చినతఱి గోగులపాటికూర్మనాథకవీంద్రుఁడు
సింహగిరినారసింహునిపై స్తోత్రరూపంబున శతకంబుఁ జెప్ప
స్వామి సంతోషభరాక్రాంతస్వాంతుఁడై తనయాలయంబునఁ
గలవస్తునికరంబుల దోచుకొనుట కేతెంచినపిండారిదుండగీడుల
దండును దుమ్మెదల సృష్టించి వానిచేఁ బాఱఁదోలెనను వార్త
లీక్షేత్రవాసు లంద ఱెఱింగినవిషయమే. ఇందేమియు వింతలు
లేవు.

ఇవ్విధంబునఁ దనమాహాత్మ్యంబును జూపుచు నర
సింహస్వామి యీక్షేత్రమున నిత్యవైభవములతో నిరంతరంబు
దులదూగుచుండును. వేలకొలఁదిజనులు దేశదేశంబులనుండి
యీక్షేత్రరాజమునకు నరసింహస్వామిని సేవించుటకై వ
చ్చుచుందురు. నాఁటినుండి నేఁటివఱకు స్వామివారికి జరుగు
నుత్సవవిశేషంబులు చూచితీరవలయునేగాని చెప్పఁదరము
కాదు. కావున మానవుండు తనజీవితంబును వ్యర్థంబుసేయక
యవయవపటుత్వ మున్నపుడే యిట్టిపుణ్యక్షేత్రంబులు సే
వించి ధన్యుఁడగుట మిగుల నుత్తమమార్గము. ఇట్లుగాక జీవి
తమునంతయుఁ జెడుపనులక్రింద వినియోగించువాఁడు దుర్గ
తులపాలు కాఁగలఁడు. ఈదేవాలయాగ్రభాగమందు మిగులఁ
జిత్రవిచిత్రంబు లగువిగ్రహాదులు చెక్కఁబడియుండెనని జను

లందఱును జెప్పుకొందురు. ఈక్షేత్రమును సేవింపనివారిమనుగడ మనుగడయే? ఎల్లప్పుడు మానవుఁడు భక్తితత్పరుఁడై తన కార్యముల నిర్వర్తించుకొని శ్రీహరిధ్యాన మాచరించుచు జన్మసాఫల్య మొనర్చుకొనుట సర్వవిషయములలోఁ బ్రధానమైన కార్యము. ఈకళింగదేశంబునం గలక్షేత్రములలో నియ్యది చాలముఖ్యమైనదని నొక్కివక్కాణింపఁదగును.

---

# 11. శ్రీముఖలింగక్షేత్రమాహాత్మ్యము.

ఈ ముఖలింగక్షేత్రము కళింగదేశములోని నిఖలశివక్షేత్రములలో నొకప్రధానక్షేత్రము. ఇయ్యది యిపుడు గంజాంజిల్లాలోఁ జేరియున్నది. ఈక్షేత్రమునఁ బ్రతిసంవత్సరమును మహాశివరాత్రికి మూఁడుదినములు మహావైభవముగా నుత్సవము జరుగును. ఆయుత్సవమునకు నితరదేశములనుండిగాని చుట్టుపట్లనుండుగ్రామాదులనుండిగాని, వేలకువేలుజనులు విచ్చేసి యీశ్వరునియందు భక్తిశ్రద్ధలతో దీపారాధనలు, భజనలు, మొదలైనవి చేయుచుఁ గాలంబుఁ బుచ్చుచుందురు. ఆసమయమున ననేకులు వర్తకులు నానావిధవస్తుజాలములం దెచ్చి వచ్చునట్టియాత్రికుల కమ్మి ధనముగడింతురు. ఈక్షేత్రమాహాత్మ్యము స్కాందపురాణములోఁ జెప్పఁబడినది.

తొల్లి తపస్సంపన్నులును, నైమిశారణ్యవాసులు నగు శౌనకాదిమహర్షులు సూతునిం జూచి క్షేత్రతత్వవిశారద!

మహాప్రాజ్ఞ ! నీ యపారకరుణారసంబునఁ గాశీక్షేత్రమాహాత్మ్య మాలించి సంతసిల్లితిమి. అశక్తు లగుబధిరపంగ్వంధాదులు పరమపావనతమం బగుకాశీక్షేత్రమునకుం బోలేరు. కావున నిఖిలజంతువులకు సులభంబుగ సేవింపఁదగినపుణ్యక్షేత్రము మఱియొకటికాశీక్షేత్రముతోఁ దుల్యమైనది కలిగినయెడల మా కానతీయుఁడనఁ దద్వచనంబు లాలకించి సూతుండు వారల కిట్లనియె.

మునీంద్రులారా ! మీరు సర్వజ్ఞులరు. మీ రెఱుంగనిపుణ్యక్షేత్రము లీలోకంబునం గలవె ? ఐనను మీ రిట్టి ప్రశ్న నన్నడుగుట, లోకహితార్థంబని భావించెద. భూమియందు జన్మించిన ప్రతిజంతువునకుఁగూడ నవసానంబున మోక్షం బొసంగుకాశీక్షేత్రముతో సమానమైనక్షేత్రము మఱియొకటి లేదు. ఇప్పుడు మీరు నన్నడిగినవిషయమునే పూర్వ మగస్త్యుండు కుమారస్వామి నడుగ నాతఁ డామునీంద్రునకుం జెప్పినపుణ్యగాథ యొకటి కలదు. దానిని వివరించి తెల్పెద వినుమని యిట్లనియె.

అగస్త్యుండు సంతతంబు భక్తితత్పరుండై కాశీక్షేత్రంబున నివసించి గంగాస్నానమాచరించుచు నిజధర్మపత్ని యగు లోపాముద్రతోఁగూడఁ బద్మనాభుఁ బూజించుచు, గాలి, నీరు, ఫలములు, మొదలైనవి తన కాహారంబుగా సేవించుచు సౌఖ్యంబుతో నుండఁ గొంతకాలంబునకు వింధ్యపర్వతము కనకాద్రింగూడ లెక్క సేయక గర్వాతిశయంబునఁ జంద్రసూర్యాదిగతినిరోధకంబై పెరిగి జగంబునంతయు నంధకారా

వ్రతంబుఁజేయ నింద్రాదిదేవత లచ్చెరు వొందుచు నాపర్వతమువలన లోకమున కుపద్రవము గలుగునని భావించి దీనిని వారించువా రెవ్వరని విచారించుచు బ్రహ్మరుద్రాదిపురస్సరులై యిందిరానాథుసన్నిధికిం బోయి దేవా! వింధ్యపర్వతంబు తన కగస్త్యుఁడు గురువగుటచేఁ బెచ్చు పెరిగి భూలోకంబున కంధత్వము గలిగించుచున్నది. దానిగర్వ మణంచి లోకంబుఁ గావుమని ప్రార్థింప నందులకు రమాకాంతుండు శంకరవిరించ్యాదులతో నగస్త్యుని యాశ్రమంబున కేగి మునిచంద్రమా! యాకాశంబునంటునట్లు పెచ్చుపెరిగిన వింధ్యాచలమువలన లోకమునకు ముప్పు వాటిల్లు నట్లున్నది. ఇప్పుడు దానిపొడవు మాన్పి లోకంబు రక్షింపుము. అందులకై దక్షిణదిశకు వేగిరంబునఁ బొమ్ము. ఈ కాశీక్షేత్రము పరమపావనమైనదని యిచ్చటనే మీరు నివసించుచుంటిరి. లోకహితము ముఖ్యము. అనవుడు నా శ్రీమన్నారాయణుని వచనంబు లాలకించి యగస్త్యమునీంద్రుండు దక్షిణాభిముఖుండై వింధ్యాద్రి యుండినతావునకుం జని భక్తిపూర్వకంబుగ గురువుగారు వచ్చినాఁడని నమస్కారంబు లాచరించు నానగంబు శిరంబుపైఁ దనకరం బుంచి “ఓ పర్వతరాజమా భక్తిపూర్వకంబుగ నాకు నమస్కరించు నీవు నేను మరల వచ్చువఱకు నిట్లేయుండుమని యాజ్ఞాపించి కాశిని విడిచివచ్చినందునఁ గలుగుకష్టంబున ననేకములగునదులు వచనంబులు దాటి పోయిపోయి తుంగభద్రాతీరంబున నున్నసరోవరంబుం బ్రవేశించి యందుఁ గృతస్నానుండై సంధ్యావందనం బొనరించుసమ

యంబున నొక వైపుననుండి ఘంటాశంఖమృదంగనినాదంబులు కర్ణగోచరం బయ్యె. అంత నగస్త్యుం డపరిమితానందకందళిత హృదయారవిందుండై యారవంబునకు జన్మస్థానం బెయ్యది యని యటనున్న మునీంద్రులం బ్రశ్నింప నామునీంద్రులు కరుణారసార్ద్రమనస్కులై యిచటి కనతిదూరంబున మయూర శైలం బనుపర్వతరాజంబు గలదు. ఆపర్వతంబున నొకవనంబు విలసిల్లుచుండె. ఆవనం బల్లనల్లన నుల్లాసంబులు మీఱ నల్లిబిల్లిగ నల్లుకొని చూపఱకు నేత్రోత్సవంబుం గావించుసంఫుల్ల మల్లీమతల్లికాదిలతావితానంబులును, దిట్టంబగునాకటం గొట్టువడి తట్టుకొనలేక చీమలకుం జెదలునకుం బుట్టలు త్రవ్వ నెలుంగులగులగులంబు లగునినాదంబులును, నీలంబులధక్క రించి విషాణశిఖ లొండొంటిం దాఁకి పెఠిల్లుమను కోలాహలంబుల గుహలం బ్రతిధ్వనింపం జేయువనమహిషంబులును, పర్వతంబుల ననుకరించు కుంభీంద్రకుంభంబులను జీల్చి తత్పలలంబుల మత్తిల్లి గుహల నిద్రించుపంచాననసందోహంబులును శాఖాంతరంబుల విహరించుచు నొకదానితో నొకటి పోరాడు ప్లవంగసంఘాతంబులును, వనహరిణంబుల మాంసంబులచే నొడలు మఱచి పాంథులకు గుండె లవియునట్లు మార్గంబుల గాండ్రుగాండ్రుమని ధ్వనిం జేయు శార్దూలసంతానంబులును, రసాలకిసలయవిసరఖాదనమత్తపికనికరగానంబులును, దరువులెక్కి సంతోషంబునం గేకలిడువిచిత్రవర్ణకంధరంబులు గలమయూరవారంబులును, దరణికిరణంబులు సొరనినికుంజపుంజంబులును బూఁదేనెల నానుమధుకరంబులఝంకారం

బులును గలిగి గరుడగంధర్వకిన్నరవిహారయోగ్యంబై విరాజిల్లుచుండె.

ఆవనంబున నిఖిలమునిజనసమాశ్రితంబైనషడాననుని యాశ్రమంబు గలదు. ఆయాశ్రమవైభవము చెప్పనలవికాదు. అది ముఖ్యముగా సేవింపఁదగినప్రదేశము. కావున నచ్చటికింబోయి కుమారస్వామిని సేవింపుమని చెప్పిరి. పిమ్మట నగస్త్యుండా మునీంద్రులు చెప్పినట్లు మయూరశైలంబున నున్న కుమారస్వామిని సందర్శింప నాతఁడు కుంభసంభవుని వీక్షించి మునీంద్రా! ఎచ్చటినుండి తాము విచ్చేసితిరి. మీ యాగమనంబునం గలకార్యం బెద్దియో తెలుపుఁడు. తోడన దానిని నెఱవేర్తు నన నగస్త్యుండా శరజన్ము వీక్షించి పార్వతీతనయా! శ్రీమన్నారాయణునియాజ్ఞచేఁ బరమపవిత్రంబైనకాశీక్షేత్రంబు విడనాడి గాసిఁజెందుచు నీయాశ్రమంబున కరుదెంచితిని. కావున నన్నిఁకఁ గాశీవిరహపారావారంబు దాటింపుము. నీకదియ సర్వఫలసంసిద్ధి యని ప్రార్థింప వానికి షడాననుం డిట్లనియె. నేనును నీవలెఁ దక్షేత్రవిరహసంతప్తుఁడనైతిని. ఆక్షేత్రమాహాత్మ్యంబుఁ బొగడ సహస్రఫణికైన శక్యంబుగాదనినఁ గుంభసంభవుండు షడాననున కిట్లనియె.

మహాత్మా! కాశీక్షేత్రంబుచందంబున ముక్తిని సేకూర్చుమఱియొకక్షేత్రం బుండెనేని తెలుపుఁడన నందుల కాశరజన్ముం డిట్లనియె. మునీంద్రా! తొల్లియొకమహామునిచే శపింపఁబడి కర్మగర్హితం బగుకళింగ మనునొకదేశంబు గలదు. ఆదేశంబునం గలజనంబుల ననుగ్రహింప శంకరుండు గిరిజా

సమేతుఁడై ప్రమథగణంబులు సేవింప మధుకేశ్వరనామంబున నట నవతరించె. దానికి జయంతీనగర మనునామంబు గలదు. అయ్యది కాశీక్షేత్రతుల్యంబు. ఆక్షేత్రంబు సేవింప నీకుఁ గుతూహల మున్న యెడల నట కేఁగుమన నగస్త్యుం డకరిమితా నందభరితహృదయారవిందుండై గిరిజాసుతా! ఆక్షేత్రోత్పత్తి విధానంబు నా కెఱింగింపుమన షడాననుం డిట్లనియె.

పూర్వము శంకరుని శాపంబునఁ దనకుం గలిగిన యపూజ్యత ననుసరించి కమలగర్భుండు చింతించుచుండ సరస్వతీశా! నీవు మరలఁ దపంబొనర్చిన, నీకుం బూజ్యతగలుగునని యాకాశవాణి వక్కాణించె. అంతట నామాట లాలించి బ్రహ్మ మహేంద్రపర్వతంబున నూఱుదివ్యవర్షంబులు తపంబాచరింప నాతపంబునకు మెచ్చి హరిహరులు కమలగర్భుని చెంత కరిగి వాణీశా! మనంబునం గలవరంబు వేఁడుము; శీఘ్రంబ యొసంగుదుమని పల్కిరి. అందులకు వాణీమనోహరుండు సంతసించి వారలకు నమస్కారంబు లాచరించి హరిహరులారా! యెప్పటియట్ల నాకు లోకంబునఁ బూజ్యతగలుగునట్లును, మునిశాపంబునఁ గర్మగర్హితం బగుకళింగదేశము పవిత్రంబగునట్లును, వరంబొసంగుఁడని ప్రార్థింప వానిప్రార్థన లంగీకరించి హరిహరులు బ్రహ్మం గాంచి చతురాననా! ఇఁకమీఁదట నీకు వివాహోపనయనాదులందుఁ బూజ్యత గలుగును. ఇంకఁ గొంతకాలంబునకుఁ గళింగదేశ మతి పవిత్రమై, మోక్షప్రదంబునై, కాశీక్షేత్రంబుతో సమానం బగునని నుడివి నిజలోకంబుల కరిగిరి.

ఇవ్విధంబున బ్రహ్మ వరంబులఁ బొంది తననివాసం బునకుం జనియె. పిమ్మట నొకానొకసమయంబునఁ దుంబుర నారదాదులు హిమశైలప్రాంతంబునఁ బుష్కరనదీతీరంబున నొకయజ్ఞంబు విష్ణుప్రీతికరంబుగఁ జేయఁబూనిరి. ఆయాగ వైభవంబులం జూచుటకు బ్రహ్మాదిదేవతలు, వామదేవాది మునీంద్రులు, పాతాళలోకంబున నివసించు శేషాదిపన్నగాగ్ర గణ్యులు చనుదెంచిరి. అంతటఁ దుంబురాదులు వారి కెదు రేగి యర్ఘ్యపాద్యాదు లర్పించి వారినిఁ బూజించి యుచితా సనంబులఁ గూర్చుండఁబెట్టి చేతుల జోడించి బ్రహ్మతో నిట్లనిరి.

వాణీశ్వరా! యీయాగ మారంభించుటకుఁ దగిన ముహూర్తంబు నిశ్చయింపుఁడన బ్రహ్మదేవుండు విచారించి రేపు సూర్యోదయంబున నీయజ్ఞం బారంభింపవచ్చును. కాని సర్వయజ్ఞభోక్తయు, యజ్ఞఫలప్రదాతయు నగుశ్రీమహావిష్ణువు పాలికిం బోయి యాతనియాజ్ఞఁబడయుట మేలని నొక్కి వక్కాణించె.

అంతట వారు బ్రహ్మదేవుని యాజ్ఞాప్రకారము శ్రీ వైకుంఠంబున కరిగి లక్ష్మీకాంతుని సేవించి స్వామీ! భవత్ప్రీతికరం బగుయజ్ఞం బొకటి సేయసమకట్టి యందులకుఁ దమయాజ్ఞనొంద నిట కేతెంచితిమనఁ బద్మనాభుండు వారలం జూచి శంకరుం డీయజ్ఞంబున కేలరాఁడు? ఆతఁడు లేనియజ్ఞం బు నాకుఁ బ్రీతికరంబు గాదు. కావున మీరు కైలాసంబున కరిగి పార్వతీశ్వరుంగూడఁ బిలువుఁడన వారు కైలాసంబున కేగి

యీశ్వరునితోఁ దమయభిప్రాయమును విన్నవించిరి. అంతట శంకరుండు త్రిశూలంబుఁదాల్చి పార్వతీసమేతుండై ప్రమథగణంబులు సేవింప హిమశైలప్రాంతంబున కేతెంచె. అంతట నట నున్నవారు శంకరు నెదుర్కొని పూజించి యుచితాసనాసీనుం జేసిరి. పిమ్మట బ్రహ్మచే ననుజ్ఞాతుండై వామదేవుండు యజ్ఞకర్మం బొనరింపఁదొడంగె.

ఆసమయంబున దేవగాయకు లగుగంధర్వులు గర్వాంధత్వంబునఁ గామరూపంబుల ధరించి హిమశైలప్రాంతకాంతారంబునఁ గానమొనరించుచు సంచరించుచుండ నామహాగాన శ్రవణంబునఁ బులకితగాత్రమై యావనంబున నివసించు శబరాంగన లాగంధర్వులచెంతకుం జని వారియసమానరూపంబున కచ్చెరువడుచు వలపు నిలుపలేక సూనశరునికుసుమబాణంబులకు లోనై తమమనోభావంబుల వారికిం దెలుప నాగంధర్వులు నీచజాతిసాంగత్యము తమకు లోకనిందావహామని నిషేధించినను వినక యనేకవిధంబుల నాశబరాంగనలు వారల మోహింపఁజేసి గంధర్వులారా! మీరు మాకూటమి నింద్యమని తలఁచితిరి. తొల్లి పరాశరమునీంద్రుఁడు దాశకన్యాసాంగత్యముఁగోరి లోకంబున నింద్యుఁడయ్యెనా? విశ్వామిత్రుఁడు మేనకాసాంగత్యం బభిలషింపలేదా? ఇట్లెందఱుగలరు? ఇంతమాత్రమునకు మీకు వన్నెదగ్గునా? కాఁబట్టి మమ్ములఁ జేపట్టి మాయాప్సితంబుల నెఱవేర్పుఁడని వారి కేమేమో బోధించి తుదకు నాగంధర్వులను దమకు లోఁబఱచుకొనిరి.

అంతట గంధర్వులు వారిబోధనలకు లోనై వారిపొందు గోరి వారితో సంచరింపఁదొడంగిరి.

ఇవ్విధంబునఁ బవిత్రంబైనయజ్ఞంబునకు వచ్చి యిట్టి దుర్వృత్తం బాచరించుచున్న గంధర్వులను వామదేవుండు గాంచి దుర్వారక్రోధపరీతమానసుండై గంధర్వులారా! యిట్టి పుణ్యస్థలంబునఁ గృత్యాకృత్యవివేకంబు లేక నీచస్త్రీసాంగత్యంబున కొడంబడి మీయిష్టానుసారముగ సంచరించుచుంటిరి. కావున మీరు శబరాలయంబులఁ బుట్టుఁడని వారికి శాపం బిడె. అంతట వారు తచ్ఛాపంబునకుఁ జింతిల్లుచు నామునీంద్రుని పాదారవిందంబులం బడి మహాత్మా! తెలియక చేసితిమి. మానేరము మన్నించి శాపమోక్షణం బనుగ్రహింపుఁడని ప్రార్థించిరి. అంతట వామదేవుండు వారిమాటల నాలించి మీరు చేసికొన్నకర్మమువలన నిట్టిదుస్థితి మీకు లభించినది. నాశాపం బమోఘంబు. దీనిని మరలింప నావలనఁగానేరదు. కావున రమాకాంతుని బ్రార్థింపుఁడని చెప్ప వారు శ్రీమన్నారాయణునిచెంత కేగి తమకుఁ గలిగినశాపప్రకారంబును విన్నవించి రక్షింపుఁడని ప్రార్థింప నాతఁడు గంధర్వులారా! మీరు శంకరుని సందర్శింపుఁడని చెప్పిపుచ్చె. పిమ్మట వారు శంకరుని దర్శించి వానిపాదంబులపైఁ బడి వామదేవుని వలనఁ దమకు గల్గిన శాపంబు వివరించి దానిమోక్షం బనుగ్రహింపవలయునని వేడిరి. అందుల కీశుండు వారి కిటనియె. మహేంద్రగిరికి దక్షిణంబునఁ గళింగ మనునొకదేశము గలదు. ఆదేశము మిక్కిలి పవిత్రమైనది. శ్రీమన్నారాయణుం డా

దేశమునకుం బవిత్రత గల్గింపఁదలంచి యచ్చటనున్న శ్వేతాద్రి పైఁ గూర్మరూపంబున నవతరించును. ఆపర్వతమునకుఁ దూర్పుకడమరలనుండి వంశధారా, లాంగల లను రెండునదులు నిరంతరంబుఁ బ్రవహించుచుండును. అచటికి నుత్తరభాగమున వంశధారాపగాతీరంబున మధూకవనంబు గలదు. ఆవనమందుఁ బూర్వమునుండి యనేకశబరాలయంబులు గలవు. మీరంద అటకేగి యాశబరాలయంబుల జన్మింపుఁడు. పరమతపస్సంపన్నుండగు నాముని శాపంబు మీకుఁ దాటఁదరంబు గాదు. కావున నాయరణ్యమందు నాదర్శనంబు మీకుఁ గాగలదు. అప్పుడు మీరందఱు శాపమోక్షణమొంది మీ మీ నివాసంబులకు మీరు చనుదెంతురు. నావుడు గంధర్వులు శంకరుని యాజ్ఞాప్రకారముగ నేగి శబరాలయంబుల జన్మించిరి తుంబురనారదాదు లాయజ్ఞంబుఁ బూర్తిగావించి హరిహరబ్రహ్మాదినిర్జరసందోహంబునకుఁ దగు సత్కారంబు లొనర్చిపంపిరి.

పిమ్మట గంధర్వులు మధూకవనంబున నీశ్వరసందర్శనంబుఁ గావించి శాపమోక్షణం బంది తమనివాసంబులకుఁ దామేఁగిరి. కావున నీముఖలింగక్షేత్రము కాశీక్షేత్రమునకుం దుల్యంబని షడాననుం డామాహాత్మ్యం బెఱింగింపఁ గుంభసంభవుం డపరిమితానందకందళితహృదయారవిందుండై చనెను. మధూకవనంబున గంధర్వుల శాపాంతంబు గావింప నీశ్వరుఁ డవతరించినది మొదలు నేఁటివఱకును మహావైభవముతో నాయనకు నుత్సవాదులు జరుగుచున్నవి. అప్పుడు

బ్రహ్మేంద్రాదినిఖిలదేవత లచ్చోటి కరుదెంచి వేదోక్తమార్గం బున శంకరుని శ్లాఘించి పార్వతీశ్వరా ! కాశీక్షేత్రంబున విశ్వేశ్వరాభిధానంబునఁ బ్రకాశించుచు భక్తుల కెల్లరకు మోక్షం బొసంగుచున్న ట్లీవనంబునఁగూడ మధుకేశ్వర నామంబున నీవృక్షకోటరంబున నవతరించి భక్తులఁ గాపాడు చుండుమని ప్రార్థింప నందుల కాచంద్రశేఖరుండు నిఖిలలోక రక్షణాబద్ధకంకణుండై గిరీంద్రపుత్రితో నదృశ్యాకారుండై యావృక్షకోటరంబున నివసించె. అంతటఁ గమలగర్భునిచేఁ బ్రార్థింపఁబడి శ్రీమన్నారాయణుం డాక్షేత్రపాలకుఁడుగ నుండె. బ్రహ్మచే నాజ్ఞాపితుండై విశ్వకర్మ యాదేవునకు గోపురప్రాకారమంటపాదుల నిర్మించె. కావున నట్టిక్షేత్రరాజ మును సందర్శించి మానవు లందఱు తమజీవితములను సార్థ కములైనవానినిఁగాఁ జేసికొనుట పరమధర్మము. మానవులకు నుత్తమలోకసౌఖ్యంబునకు భక్తియే నిశ్రేణి యనందగు. భక్తి నావవలన జనులు సంసారసముద్రమును దరించి మోక్ష మొందుదురు.

# 12. విజయనగరసామ్రాజ్యాధిపతులు

## కళింగదేశ దండయాత్ర

కళింగదేశ విశేషము లిదివఱకు ననేకవిధములుగ నుప — —ఁబడినవిషయము పాఠకులకు విదితమే. క్రీ. శ 1434 సంవత్సరమున గాంగవంశపు రాజులలోఁ జివరవాఁడగు నాల్గవ

భానుదేవుఁడు కళింగరాజ్య మేలి పరలోకగతుఁ డైనపిమ్మట నాతనిమంత్రి సత్తముండు కళింగరాజ్యమును బలవంతముగ నాక్రమించుకొని కపిలేశ్వరగజపతి యనుపేర నారాజ్యమును లోకంబునఁ దన కెవ్వరు సాటిలేనియట్లు పరిపాలింపసాగెను. ఈతఁడె గజపతివంశమునకు మూలపురుషుఁడు. ఈతనికాలమునఁ గళింగరాజ్యము కృష్ణానదిమొదలుకొని గంగానదివఱకు వ్యాపించి మహోన్నతదశయందుండెను.

ఇట్లీతఁడు రాజ్య మేలుచుండఁ గొన్నాళ్ళకు నతనికిని విజయనగరాధిపతులకును రాజ్యంబుననుసరించి పరస్పరశత్రుత్వము సంభవించెను. ఈవైరము ప్రబలినప్పటినుండి సమయము కనిపెట్టి యొకరిరాజ్య మొకరు స్వాధీనముచేసికొనవలయు ననుదుర్భావంబులతో నుభయులును మెలంగుచుండిరి. ఇవ్విధంబునఁ గొంతకాలము గడువ పరాక్రమవంతుం డగుకళింగదేశాధీశ్వరుండు సమయంబునకు వేచియుండి వెంటనే పరాక్రమసంపన్నులగు సైన్యంబులతో విజయనగరముపై యుద్ధయాత్రకు బయలుదేరెను. అగ్నికి వాయుసహాయము కలిగినట్లు గజపతికి మహమ్మదీయసామ్రాజ్యాధీశ్వరుం డగునల్లాయుద్దీనుచక్రవర్తికూడఁ దోడయ్యె. ఆసమయమున మల్లికార్జునరాయలు రణరంగమున కుఱికి తనపరాక్రమాతిశయంబున వైరివీరులఁ జెండాడె. అట్టితఱి గజపతికిని, యవనాధిపతికిని, బరాభవంబు సంభవించె. కాని గజపతిమాత్రము తనకుఁ గల్గిన పరాభవమును సహింపలేక మఱియొకసమయమునకై కాచియుండి మరల సేనలం గూర్చికొని దక్షిణదేశమునఁ గాంచీ

పురమువఱకు దండెత్తి యాపట్టణము స్వాధీనపఱచుకొనుట వలనఁ గలిగినసంతోషముచే స్వదేశమునకు వచ్చి పూర్వము తనకుం గల్గినపరాభవాగ్నిని జల్లార్చుకొనెనని యీతనిశాసన మూలమునఁ దెలియుచున్నది. గజపతులవలన నప్పుడప్పుడు విజయనగరసామ్రాజ్యమున కుపద్రవములు సంభవించుచునే యున్నవి. కాని యీయుపద్రవముల నణఁచి తనపరాక్రమము ను వెల్లడించి రాజ్యం బేలురాజొక్కరుఁడును, విజయనగర మున లేకుండెను. ఇట్టిస్థితిలో విజయనగరసామ్రాజ్య మొకా నొకప్పుడు కళింగదేశాంతర్గత మగునేమో యనుసందియము కూడఁ గలుగుట సంభవించెనఁట. ఇట్టిపరాక్రమశాలి యగు కపిలేశ్వరగజపతి స్వర్గస్థుఁ డైనపిదప నతనిపుత్త్రుం డగుపురు షోత్తమగజపతి క్రీ. శ. 1470 సంవత్సరప్రాంతమునఁ గళింగ రాజ్యము నభిషిక్తుఁడై తగురీతి రాజ్యపరిపాలనం బొనరించు చుండె. ఈపురుషోత్తమగజపతియుఁ దనతండ్రివలె బాహుబల దర్పవిజృంభితుండు గావున నీతఁడుకూడ విజయనగరసామ్రా జ్యముపై దండెత్తిపోయి కాంచీనగరమును లోఁబఱచుకొని నప్పుడు దమకుఁ బట్టుపడినశత్రువులలోఁ దన్నగరరాజపుత్త్రి కూడ నుండ నామెను బురుషోత్తమగజపతి పెండ్లాడెనని తెలి యుచున్నది. ఏదియెట్లున్నను బహునైదవశతాబ్దాంతమువఱకు గజపతులకు నెదురులేకుండె. అప్పటినుండి కళింగదేశప్రతిభ కొంత తగ్గినదని చెప్పవచ్చును.

పిమ్మట నాశతాబ్దాంతముననే మహమ్మదీయులు పురు షోత్తమగజపతిపుత్త్రుఁ డైన ప్రతాపరుద్రగజపతికాలమునఁ

గళింగదేశముపై దండెత్తివచ్చి జగన్నాథదేవాలయమును ముట్టడించి కొన్నికొన్ని దేవాలయముల నేలపాలు గావించిరి. అట్టిసమయమున విజయనగరసామ్రాజ్యమందుఁ దగినసమర్థులు లేనికారణమున నారాజ్య మన్యాక్రాంతము కావలసి వచ్చినది. అట్టితఱి దండనాథుం డగు సాళువనరసింహరాయలు విజయనగరసామ్రాజ్యము గజపతులకుఁగాని, మహమ్మదీయులకుఁగాని, వశమగునేమోయని భయపడి వారలకటాటోపమాపివేయవలయునని సంకల్పించుకొనెను. నరసింహరాయలకు విజయనగరముపై గజపతులు దండెత్తివచ్చి దక్షిణమునఁ గాంచీనగరము స్వాధీనముచేసికొనుట కడు నయిష్టముఁగానుండెను. కాని యాసమయమునఁ దాఁజేయునది లేకపోయినను, బదంపడి కళింగరాజ్య మేలుచుండిన గజపతిపై యుద్ధమునకు బయల్వెడలెనఁట. కావున నీతని కాలముననే కళింగదేశాధీశ్వరులకును, విజయనగరసామ్రాజ్యాధిపతులకును, విరోధము ప్రబలినదని పైవిషయములవలనఁ దెలియుచున్నది. పిమ్మట 15వ శతాబ్దాంతమున విజయనగరము తుళువవంశీయుల చేఁజిక్కినది.

విజయనగరమునకు నిమ్మడి నరసింహరాయలు ప్రభువైనను, దండనాథుం డగు తుళువనరసింహరాయలు పరాక్రమసంపన్ను లగుతనసైనికులతో బయలుదేరి రాజ్యమును విస్తరింపఁజేసి యుత్తరమునఁ గళింగదేశమును జయించినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. కావున నీరెండురాజ్యములకు సాళువనరసింహరాయలకాలముననేగాక తుళువనరసింహ

రాయలకాలమునఁగూడఁ బ్రబల విరోధ మున్నట్లు కాన్పించు చున్నది. కళింగదేశమును బాలించిన పురుషోత్తమగజపతి స్వర్గస్థుఁడైనపిదప నాతనిపుత్త్రుం డగు ప్రతాపరుద్రగజపతి విజయనగరాధీశ్వరులరాయిడికిఁ బాల్పడె ననుటకు సంశయము లేదు. అట్టితరుణమున నుత్తరమున వంగదేశాధిపతు లగుమహమ్మదీయులు, పశ్చిమమున బహమనీసుల్తానులు, దక్షిణమున విజయనగరాధీశ్వరులు, కళింగదేశాధిపతికి విరోధులై యుండిరి. 1506 ప్రాంతమున విజయనగరమునకు వీర నరసింహరాయలు సాళువనరసింహునిపిమ్మట రాజయ్యెను. కాని యీతనికాలమున రాజ్యకల్లోలము లేవియు విశేష ముగఁ గాన్పించుటలేదు.

కృష్ణదేవరాయలకాలమునాఁటికిఁగూడఁ దూర్పుతీరము గజపతులపాలనమునందే యుండె ననుటకు సంశయములేదు. ఎన్నిపర్యాయములు తమపరాక్రమమును విజృంభించి గజ పతుల నోడించి కళింగదేశమును విజయనగరసామ్రాజ్యాంత ర్గత మగున ట్లొనర్పఁ బ్రయత్నించినను రాయలకుఁ బూర్వ ము విజయనగరాధీశ్వరు లట్లొనర్చియుండలేదు. పిమ్మట రా యలు రాజ్యమునకు వచ్చి దక్షిణమున శివసముద్రము మొద లగుప్రదేశములం దీయుపద్రవము లేమియు లేకుండఁజేసి గజపతుల నణఁచినఁగాని తూర్పుతీరమున సామ్రాజ్యము వైభవోపేతముగ నుండదని భావించెను.

ఇవ్విధంబున ధైర్యశౌర్యగాంభీర్యాదులచే నొప్పారు కృష్ణరాయలు కొంతకాలము సమయమును నిరీక్షించి పిమ్మటఁ

కళింగరాజ్యము నంతయు నాక్రమించుకొని విరోధిజనాగ్రగణ్యుఁ డగు గజపతిని నోడింపవలయు నను దృఢసంకల్ప మాతనిచిత్తంబున నుదయించెను. ఇట్లువిచారించుచు 1514సంవత్సరాంతమున రాయలు నెల్లూరుజల్లాలోని యుదయగిరిదుర్గము ముట్టడించి దానిని దా నాక్రమించుకొనెను. ఈయుదయగిరి కళింగరాజ్యములోని దగుటచేఁ గళింగదేశమునఁ గొంత జయించిన ట్లూహింపవలసియున్నది. ఈ సమరంబునఁ బ్రతాపరుద్రగజపతి పరాజయమొంది కొండవీటికిఁ బాఱిపోయెనఁట. అంతట రాయలు తా నతిసంతోషంబున నుదయగిరిదుర్గము నాక్రమించి యందున్న యొకకృష్ణవిగ్రహమును దెచ్చి విజయనగరమునఁ బ్రతిష్ఠించి యచ్చట నాకృష్ణునిపేరుతో దేవాలయ మొకటి తద్విజయజ్ఞాపకచిహ్నముగఁ గట్టించెను ఈవిషయము విజయనగరశాసనమువలనఁ దెలియవచ్చుచున్నది.పిమ్మట రాయలు తిరుపతికిఁ బోయి యచ్చటఁ దనయిష్టదైవ మగు శ్రీనివాసుని సందర్శించి యాదేవునకు సువర్ణాభరణములు మొదలగు కానుకల సమర్పించెను. ఉదయగిరి ముట్టడియుఁ బ్రతాపరుద్రగజపతి పరాజయంబును, దిరుపతి శాసనముల వలనఁ దెలియఁబడుచున్నది.

ఇవ్విధంబున నట్టియుద్ధమునఁ బరాజితుఁడైన ప్రతాపరుద్రగజపతి కొండవీటిదుర్గమునకు వచ్చి యచ్చట నతిధీరులైన సైన్యములను జేర్చుకొని కోటను గాపాడుచుండెను.రాయలు కృష్ణానదికి దక్షిణభాగమునఁగాని,పశ్చిమమునఁగాని గజపతికిఁ జోటులేకుండఁ జేయవలయునని తలంచెను. ఇట్లు తలఁచి పి

మ్మట విజయనగరమున కేతెంచి తగుసైన్యంబుల వెంటఁబెట్టు కొని కొండవీటిదుర్గమును జయింప బయలుదేరెను.

ఈ దండయాత్రిలో కృష్ణరాయలమంత్రి యగుతిమ్మరుసుగూడ నుండెను. కొండవీటిముట్టడిలో నిర్వక్రపరాక్రమవంతుం డగునీతిమ్మరుసుసహాయమువలన రాయలకు విజయంబును, గజపతికిఁ బరాభవంబును సంభవించెను. కొండవీటి శాసనమువలన నీదుర్గము క్రీ. శ. 1515 వ సంవత్సరమున రాయలకు స్వాధీనమయ్యెనని తెలియవచ్చుచున్నది. రాయలు కొండవీటిని జయించినపిదపఁ బుణ్యక్షేత్రములు దర్శింపవలయు ననుకుతూహలము గలవాఁడై బయలుదేరి కాళహస్తి మొదలగు క్షేత్రంబుల సేవించి మరల విజయనగరముఁ జేరెను. ఆ యాశాసనములలోఁ బ్రతాపరుద్రగజపతికుమారుం డగువీరభద్రగజపతి పట్టుపడుట, తదితరసామంతరాజులను లోఁబఱచుకొనుట మున్నగువిశేషంబులు వ్యక్తముగా వివరింపఁబడినవి.

ఇవ్విధంబున రాయలు కళింగదేశమును జయించి కళింగదేశాధిపతిని లోఁబఱచుకొనెను. ఈవిషయమునే ముక్కుతిమ్మనార్యుఁడు పారిజాతాపహరణమునఁ గృష్ణరాయవిజయమందు స్పష్టముగా వివరించెను. రాయలు తనవైరికోటిలోని వాఁడును, ప్రతాపరుద్రగజపతికుమారుఁడు నగు వీరభద్రగజపతిని క్షాత్రధర్మము ననుసరించి రాజ్యమును జయించి పట్టుకొనెను గాని యాతని కేవిధమైన యుపకారమును గావింపక తన ముఖ్యసామంతులలో నాతని నొకఁనిఁగాఁ జేసి రాజనీతిని వెల్లడించెను. కొండవీటి విజయంబుతో రాయని రెండవ

కళింగయుద్ధయాత్ర ముగిసెను. పిమ్మటఁ గొన్ని నెలలు విజయ నగరముం జేరి యటఁ బండితకవులగోష్ఠి నుండెను. కావున నీ కొండవీటివిజయమునకును, మూడవకళింగదేశయుద్ధయాత్రకును, మధ్యకాలముననే తిమ్మనార్యుఁడు పారిజాతాపహరణమును రచించి రాయల కంకితమిచ్చెను.

పిమ్మటఁ గొంతకాల మట్లుగడిపి తాఁ జతురంగబలసమేతుఁడై కటకముపై యుద్ధయాత్రకుబయలుదేరి యహోబిలము మీఁదుగాఁ బోయెను. ఈవిషయ మహోబిలశాసనమునఁ జెప్పఁబడినది. ఇట్లాలస్యము లేకుండ రాయలు వెంటనే బయలుదేరుట గజపతిపైఁ గల ప్రబలవిరోధమును, నిజకార్యదీక్షను వెల్లడించుచున్నది. ఇవ్విధంబునఁ బరాక్రమించి రాజమహేంద్రవరము మీఁదుగాఁ గటకముఁ బ్రవేశించి దానిని జయించి నట్లు తనశాసనములోఁ జేర్కొన్నను, దగిన వివరములు మాత్రము లిఖింపఁబడ లేదు. కృష్ణరాయలు తగుసైన్యముతో గజపతిపై యుద్ధయాత్రకు వెడల గజపతి యాధాటికి వెఱచి పాఱిపోయి రాయలతో సంధియొనర్చుకొనినట్లును, రాయ లంతమాత్రముననే వానిరాజ్యము వాని కిచ్చి వానికుమార్తెను వివాహమాడినట్లును, గావ్యములందుఁ గథలయందుఁ గూడ వ్రాయఁబడినది. కాని సింహాచలశాసనమున దీనికి వివరములు గాన్పింపవు.

పూర్వము సూర్యవంశసంభూతుఁడైనరఘుమహారాజు దిగ్విజయంబునకైబయలుదేరి యెదిరించినవారిని జయించి లోఁ బడినవారిని రక్షించి వారిరాజ్యంబులు వారి కిచ్చి తాను

జయించినట్లు జయస్తంభములు పాతించె ననువిషయము రఘువంశమహాకావ్యమునఁ గాళిదాసమహాకవిచే వర్ణింపఁబడి యున్నది. అట్లు రఘుమహారాజు తనపరాక్రమము వెల్లడించుటకై దిగ్విజయంబునకు బయలుదేరెను; గాని రాజ్యకాంక్ష వలనఁ గాదనువిషయము పైదానివలనఁ దేటతెల్ల మగుచున్నది. కావున నావిధముననే యీరాయలుకూడ గజపతిరాజ్యము గజపతి కిచ్చివేయుటంబట్టి విచారింపఁ దనపరాక్రమంబు వెల్లడించుటకే కాని రాజ్యకాంక్షకై కాదనువిషయము మనకు స్పష్టమగుచున్నది.

అట్టికళింగదేశమును పెక్కురు పాలించిరి. ఎవ్వరు పరిపాలించినప్పటికిని, వారికాలమున నిట్టిలేనిపోనికలహములు లేవు. కృష్ణరాయలకాలమునమాత్రి మెట్టివారికి లోఁబడని కళింగదేశము తుద కెట్లో వానిస్వాధీనమైనది, కాని వేఱుగాదు. క్రీ. శ. 1516 సంవత్సరము వచ్చువఱకే రాయలు కటకమును జయించి గజపతితో యుద్ధముసమాప్తిగావించెనని యూహింపవచ్చును. కుమారధూర్జటికవిచే వర్ణింపఁబడినకళింగదిగ్విజయయాత్రలోఁ గృష్ణరాయలవిశేషంబు లన్నియుఁ దెల్లంబులు గాఁగలవు. మనుచరిత్రమునందుఁగూడ నల్లసాని పెద్దనామాత్యునిచే రాయలు గజపతినిఁ గాచి వానికుమార్తెను వివాహమాడినట్లు చెప్పఁబడినది. కావున నీవిషయమే స్థిరంబని నమ్మఁదగియున్నది. తమిళకావ్యములోఁగూడ రాయలు గజపతి కుమార్తెను వివాహమాడెనని వర్ణింపఁబడు

టచే నియ్యది సత్యమైనదని చెప్పుటలో సందియ మేమాత్ర మును లేదు.

రాయలు కళింగదేశమును జయించినపిమ్మట ననేకము లగు పుణ్యస్థలంబుల సేవించి యున్నాఁడని శాసనములమూల మున మనకుం దెలియుచున్నది. ఇట్లు పుణ్యక్షేత్రములే కాక, తామ్రపర్ణి, కావేరి, మొదలగు తీర్థయాత్రల సేవించి మరల విజయనగరంబుం జేరెనని రాయల తీర్థయాత్రాదికములు ధూర్జటికవిచే నీచెప్పినట్లు వర్ణింపఁబడినవి. రాయలు తా నున్నంత వఱకు దిగ్గజములవంటి కవీశ్వరులఁ బోషించి యాంధ్రకావ్యములు వ్రాయించి యాంధ్రభాషను వృద్ధిలోనికిఁ దెచ్చెను.

భాషను వృద్ధిగావించినవారిలో రాయలు మొదటి వాఁడు. వీనివలె భాషనుగాని, పండితులఁగాని, కవులనుగాని, పోషించినవాఁడు మఱొక్కఁడు లేఁడు. ఈతనికాలమున సర్వ వర్ణములవారు తమతమవర్ణాశ్రమాచారంబులను జక్కగ నాచరించుచు వచ్చిరి. క్షాత్రధర్మముల నాత్మలో నుంచుకొని ధర్మమార్గంబు దప్పక రాజ్యంబు నేలి దిగంతవిశ్రాంతకీర్తి విరాజితుండై క్రీ. శ. 1529సం॥ప్రాంతమున నితఁడు పరలోకగతుఁ డయ్యెను.

మఱియు రాయలకాలమునాఁటికి విజయనగరాధిపతులకును, గళింగదేశాధిపతులకును, నెడతెగనివైరము ప్రబలి యుండెను. అంతవఱకుఁ గళింగదేశాధిపతు లగు గజపతుల వలన విజయనగరసామ్రాజ్యమున కేవో యుపద్రవములు

సంభవించుచునే యున్నవి. ఈతఁడు వచ్చినపిమ్మట నుపద్రవములకు నెడమీయక కంటికి ఱెప్పంబలె విజయనగరసామ్రాజ్యమును గాపాడుచుండెను.

మొదటినుండి మిగులఁ బ్రఖ్యాతిఁగాంచిన కళింగదేశమును గజపతులే పాలించుచుండిరి. గజపతులు కాలముదప్పి యీనాఁటికిఁ గృష్ణరాయనికి లోఁబడినను వారి విక్రమాటోపములు వర్ణింప నలవిగానివి. వారికాలమున నున్నకళింగదేశవైభవము వేనోళ్ళుగల శేషునికైనఁ జెప్ప నలవిగాకుండెను. అప్పుడు దేశమునం దేయుపద్రవములు లేవు. వారికాలమున నాదేశమున సర్వజాతులవారు తమతమవర్ణాశ్రమాచారంబుల యథాశాస్త్రముగ నాచరించుచుండిరి. కళింగదేశము పవిత్రమైనదని యిదివఱలోఁ జెప్పియుంటిని. కావున నాంధ్రదేశమునుండి జను లట్టికళింగదేశమునకు బయలుదేరిపోయి యచ్చట నవతరించిన శంకరున కెట్లు దానములు, నఖండదీపారాధనలు, మొదలగునవి చేయించి సేవించి వత్తురో యట్లే కళింగదేశమునుండి దక్షిణాపథమున కంతకు దక్షిణకాశి యనిపేరు గాంచిన దక్షవాటికకుఁ దీర్థయాత్రకై చని యట భీమేశ్వరుని సేవించి వచ్చుచుందురు. ఈతీర్థయాత్రమూలమునఁ గళింగదేశమునుండి వచ్చిన మహాప్రముఖుల దీపదానాదిశాసనము లీ భీమేశ్వరుని నగరియందుఁ గాన్పించుచున్నవి. ఇందు ముఖ్యముగ ననంతవర్మమహారాజు మొదలగువారి నామములు విశేషముగఁ గానవచ్చుచున్నవి. వీరందఱును, బూర్వచాళుక్యులతో సంబంధము గలవారగుటచేతను, దత్కాలమున నాం

ధ్రికళింగదేశములు పోరాటములు దక్కి కలసిమెలసి కడ మైత్రితో మెలంగుచుండుటచేతను, దక్షవాటికకుఁ గళిఁ రాజకుటుంబములు మిగుల వచ్చుచుండుట తటస్థించెను. చో గంగదేవమహారాజుకూడ క్రీ. శ. 1142, 1143, సంవత్సరములలో దక్షవాటికకుఁ దీర్ఘయాత్రానిమిత్తమై యేతెంచినట్లప్పటిశాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. కాఁబట్టి యిట్టి ప్రసిద్ధమైనకళింగదేశమునకును, విజయనగరసామ్రాజ్యమునకును, కృష్ణరాయలయనంతర మెట్టిపోరాటములు లేవని చెప్పఁదగియున్నది.

సమాప్తము.



గుంటూరు, చంద్రికాముద్రాక్షరశాలయందు ముద్రితము.

# మావద్ద విక్రయమునకు దొరకుగ్రంథములు

——:o:——

1. వాచక పారిజాతము -

1వ భాగము (అపూర్వము.) ... 0-12-0

బ్రి. శిష్ట్లా హనుమచ్ఛాస్త్రీగారిచే గ్రథితము

2. వాచక పారిజాతము -

2వ భాగము (అపూర్వము) ... 0-12-0

బ్రి. శిష్ట్లా హనుమచ్ఛాస్త్రీగారిచే గ్రథితము

3. రుక్మాంగద - (అపూర్వము) ... 0-12-0

బ్రి. శిష్ట్లా హనుమచ్ఛాస్త్రీగారిచే విరచితము

4. బాలకథాకౌముది - (అపూర్వము) ... 0-6-0

పండిత డి. సీతారామరాయ విరచితము

5. దసరాగేయములు — కోలాటకీర్తనలు ... 0-1-6

మఱియు నన్నిరకముల సంస్కృతాంధ్ర గ్రంథములు స్కూలుపుస్తకములును మాకడ విక్రయింపబడును.

బి. బి శారిశింగు,
ప్రొప్రయిటరు,

ఆంధ్రబుక్కుడిపో., గుంటూరు.

